కామగ్రంథమాల — రెండవగ్రంథము

# చంద్రరేఖావిలాపము

కీర్తిశేషుఁడైన కూచిమంచి జగ్గకవి
ప్రణీతం బైన హాస్యరస
ప్రబంధరాజము.

క. "ఈకృతికి సమముగాఁ గృతి
నే కవులను జెప్పఁజాల రిది బిరుదము"

"జగ్గకవి"
1922


వెల రు 1-8-0.

చందాదారులకు మాత్రమే
పోష్టుఖర్చులుసహా

# చుక్కాని

ధనార్జనార్థమును బాండిత్యప్రకటనార్థమును బహుదేశాటనముం జేసి రాజసంస్థానములలో సత్కారముల నంది కీర్తిశేషుఁ డైన కూచిమంచి జగ్గకవి యొకప్పుడు విజయనగరమునకుఁ జని విజయనగరసంస్థానాధిపతు లగు శ్రీ పూసపాటి విజయరామరాజుగారి చెల్లెలి పెనిమిటి యగు చింతలపాటి నీలాద్రిరాజు నాశ్రయింపఁగా నాతఁడు తా నుంచుకొనిన వేశ్యను నాయికఁగా జేసి తనమీఁద ప్రబంధము రచింపు మని కోరఁగా జగ్గకవి యందుట కియ్యకొని చంద్రరేఖావిలాస మను శృంగారకావ్యమును రచించుటయు నంతలో నాడిమళ్ళ వేంకటశాస్త్రి సంస్కృతకావ్య మొండు రచించి యిచ్చెద నని చెప్పి జగ్గకవి కావ్యమును నిరసించులటులఁ బ్రోత్సాహించి నీలాద్రిరాజు మతిని మరలించుట వలన నా నీలాద్రిరాజు జగ్గకవికిఁ దగిన బహుమాన మిచ్చి సత్కరింపక తిరస్కారమును గనఁబరచుటయు నందువలన జగ్గకవి తాను రచియించిన చంద్రరేఖావిలాసమును చింపివైచి చంద్రరేఖావిలాపం బను నీ హాస్యరసప్రబంధమును రచించుటయు దటస్థమైనది. అనంతర మీ జగ్గకవి హైదరాబాదునకుఁ బోయి తురకదొరల నాశ్రయించి వారికిఁ దన పాండత్యప్రతిభను జూపి వారి దయను సంపాదించి వారి సామంతరాజ్య మైన విజయనగరమునకుఁ బ్రభుఁడగు శ్రీ విజయరామరాజుగారివద్దకుఁ దన గ్రంథమును నీలాద్రిరాజు సమ్ముఖంబున సభలోఁ జదివించునటుల నవాబుగారివద్దనుండి ఫర్మానా తెచ్చి య ట్లొనర్చె నని జనశ్రుతి గలదు.

ఈ జగ్గకవి యిరువది సంవత్సరములు వచ్చునంతదనుక చదు వెఱుఁగక పలుగాకివలెఁ దిరుగుచుఁ గాలము గడుపుచుండె ననియు, కందరాడవాస్తవ్యుఁ డై బహుళప్రబంధకర్త యై పీఠికాపురప్రభు వగు రావు నీలాద్రిమాధవరాయరాజశిఖామణిచే కవిసార్వభౌమబిరుద మంది సుప్రసిద్ధకీర్తి గాంచిన తిమ్మకవి యీతని కగ్రజుం డగుటవలన నవిభక్తకుటుంబగౌరవమున జగ్గకవికి వివాహ మాయె ననియు, ననంతరము జగ్గకవి మనుగుడుపుల కేఁగియున్నపు డతని ప్రవర్తనమును జూచి పరమశుంఠ యగు నల్లుఁడు దొరికినందులకు జగ్గకవిమామగా రనుతాపబడి తన మిత్త్రులతో "నా తొమ్మండ్రు కూఁతులను గుక్కలను జంపుకొని తిను కొయ్యలకే యిచ్చితిని" అని యనెననియు, నందుపై జగ్గకవి మామగారి మాటలకు రోషము తెచ్చుకొని దేశాంతర్గతుండై మంగళగిరి కరిగి వేంకటాచార్యులను సుప్రసిద్ధపండితునియొద్దం జేరి యాతని నాశ్రయించి విద్యాభ్యాస మొనర్చి పది పండ్రెండేండ్లలలోఁ బండితుండై యనర్గళముగా కవిత్వము చెప్పనారంభించెనని పుక్కిటపురాణముగాఁ జెప్పికొందురే గాని కేవల మిక్కధ కల్పితమని తోఁపకమానదు. ఈకథయే నిక్కమగుచో జగ్గకవి కవిత్వము చెప్పనారంభించునప్పటికి ముప్పది రెండు సంవత్సరముల ప్రాయమై యుండవలెనుగదా! కూచిమంచి తిమ్మకవి తాను ముప్పదిసంవత్సరముల వయస్సుననే రచింప నారంభించిన "సింహాచలమహాత్మ్యము"నఁ దన పెద్దతమ్ముఁడైన సింగన్నను వర్ణించిన తరువాత రెండవతమ్ముఁడైన యీ జగ్గకవినిగూర్చి యిట్లు వ్రాసియుండెను.

క. అతని యనుజన్ముఁ డతులిత
మతియుతుఁడు, సమస్తరాజమాన్యుఁడు, సుగుణా
న్వితుఁడు, సమంచితకవితా
చతురుఁడు, జగ్గప్రధాని చంద్రుఁడు తనరున్.

క. భోటకలాటకిరాటవ
రాటమరాటాంగవంగరాజన్యసభా
ఝాటనిరాఘాటనట
చ్చాటుకవిత్వాంకుఁ డరయ జగ్గన ధరణిన్.

సీ. నిరతంబు నుడి వోని సిరి నిర వొందియుఁ
దవుటినిప్పటి మెక్కఁ దలఁపఁ డేని
సదమలాచారప్రశస్తి గాంచియు వర్ణ

ములు సంకరంబుగాఁ గలఁపఁ డేని
ఖలజనసంశిక్ష గావింపుచుండియుఁ
బతితుల నెపుడుఁ జేపట్టఁ డేని
యురుపుణ్యావర్తి యయ్యును బాడబాశ్రయ
సీమ నిల్లుగను వసింపఁ డేని.

గీ. యల జగన్నాయకుఁడు సాటి యనఁగఁబోలు
భోగమున నిర్మలాచారమున విశిష్ట
రక్షణంబునఁ బుణ్యమార్గమున నరయ
గంగనామాత్యు జగ్గయ ఘనునితోడ.

ఈ పద్యములు రచియింపఁబడిన కాలమునకు జగ్గకవి కించుమించుగా నిరువదియైదు సంవత్సరముల ప్రాయమై యుండును. ఇరువదియైదు సంవత్సరముల ప్రాయమునాఁటి కన్నిదేశములు దిరిగి రాజసభలలో బ్రఖ్యాతి గాంచఁగల్గుటకు కవి యిరువదియేండ్ల వయస్సునకు ముందే పండితుండయి కవనచాతురి గలవాఁడయి యుండవలెను. అందువలన జగ్గకవి యిరువదిసంవత్సరముల ప్రాయము వచ్చువఱకును నక్షరజ్ఞానములేనివాఁ డని చెప్పెడిమాటలు నమ్మందగినవి కావు. ఈ జగ్గకవి తనయన్న యగు తిమ్మకవి జీవించినంతకాలము జీవించియున్నటుల కనఁబడుచున్నది గా 1700 సంవత్సరప్రాంతముమొదలు 1760వ సంవత్సరమువఱకును జీవించియుండెనని తేలుచున్నది.

మఱియు నీ జగ్గకవి చంద్రరేఖావిలాపపీఠికయందు "రచయించితిని" అను పద్యమునందు తాను రచించిన గ్రంథములను బేర్కొనియుండెను. అవిగాక మఱికొన్ని గ్రంథములనుగూడ రచియించినటు లతని మనుమనిమనుమఁ డగు వేంకటరాయకవి రచితమైన నీ సీసమువలనఁ దెలియుచున్నది.

సీ. ప్రతిభ మై జానకీపరిణయంబున నర్మ
దాపరిణయము రాధాకథాసు
ధానిధానము ద్విపదయు సుభద్రాపరి
ణయము నుమాసంహితయును దండ
కములును బహుశతకములును గీతప్ర
బంధముల్ ఖడ్గాదిబంధములును
గద్యలు రగడలు ఘనతరమంజరుల్
బహుసువృత్తంబులు భాసురముగఁ.

గీ. జెప్పి శ్రీ పురుషోత్తమక్షేత్రపతికి
శ్రీ జగన్నాయకులకు నర్పించి మించె
ధైర్యగాంభీర్యచాతుర్యశౌర్యముఖస
మిద్ధగుణపాళి జగ్గకవీంద్రమౌళి.

ఇతఁ డిన్నిగ్రంథములను రచించినను బూర్వప్రబంధమార్గమునే త్రొక్కియుండెను. గావున సర్వసాధారణకవిగా నెన్నఁబడెడివాఁడె గాని మానవవ్యవహారములను బ్రదర్శించు పాత్రలను జిత్రించుచు హృదయంగమముగానుండి హాస్యరసప్రబంధరాజం బనందగు నీ చంద్రరేఖావిలాపమును రచించుటవలన నీతని యసాధారణప్రజ్ఞయు, నపూర్వకల్పనాశక్తియు, నాత్మగౌరవపురస్సరమగు పౌరుషాతిశయమును, వేయినోళ్ళ నుద్ఘాటింపఁజాలు శాశ్వతకీర్తికిఁ గారణమైనది.

క్షీరసముద్రమువంటి యీ గ్రంథరాజమును బూఁతులతో బూరించుటవలన నీ యిరువదవ శతాబ్దమున గర్హింపబఁడుచుండుట కేవలము కాలముయొక్క దోష మనవచ్చును.

పూర్వకాలమున బూఁతును నిప్పటివలె దోషముగాఁ బరిగణింపక గుణముగాఁ బరిగణించినటులఁ గానవచ్చుచున్నది. కావుననే జగ్గకవి "బూఁతులన్ బూర్ణుఁడ" వని ప్రభువు తన్ను నుతించినటుల వ్రాసుకొనెను. మఱియు సుప్రసిద్ధకవులగు కాళిదాసు డిండిమాదులంతవారు

సైతము సంస్కృతమునఁ దమ ప్రహసనములను బూఁతులతోఁ బూరించిరి. ప్రతాపరుద్రీయాదులందలి హాస్యరస లక్షణములు బూఁతులతోడనే బూరింపఁబడినవి. ఇవిగాక యాంధ్రమున —.

క. నీతుల కేమి యొకించుక
బూఁతాడక దొరకు నవ్వు పుట్టదు ధరలో
నీతులు బూఁతులు లోక
ఖ్యాతులురా కుందవరపుఁ గవి చౌడప్పా.

క. పదినీతులు పదిబూఁతులు
పదిశృంగారములు గల్గు పద్యములు సభం
జదివినవాఁడే యధికుఁడు
గదరప్పా కుందవరపుఁ గవి చౌడప్పా.

క. బూఁ తని నగుదురు తమతమ
తాతలు ముత్తాతమొదలు తరతరములవా
రే తీరున బూఁ తెఱిగిరి
ఖ్యాతిగ మఱి కుందవరపుఁ గవి చౌడప్పా.

ప్రాచీనకవులు హాస్యరసపోషణమునకు బూఁతులే ప్రధాములని యూహించిరో? నీతిబాహ్యప్రవర్తనములయెడ రోఁత పుట్టించుట కవి ముఖ్యములని యెంచిరో? రాజ్యసంక్షోభాదులవలన నీతుల చెడిన తమకాలమునాఁటి జనతాస్థితిని కావ్యదర్పణములం బ్రతిఫలింపఁజేసిరో? గాని యాంగ్లమునఁ గూడ హోమరు వర్జిలు వికటకవిత్వపుపోకడ లిట్లే యుండునని బ్రౌనుదొరగారే వ్రాసిరి.

సంపూర్ణవికటకవితామహత్వమునం జేసి నిరుపమానమై యపూర్వకల్పనాశిల్పవైదుషీమనోహరమై ధారాళమై నీతిబోధకమైన యీహాస్యరసప్రబంధరాజ మజ్ఞాతవాసము పాలు గాకుండ కళాపోషణమునకైనను సురక్షితముగా దాచి యుంచవలె నని మాయుద్దేశము.

మఱియు నాకాలపు బ్రాహ్మణులయొక్కయు కవులయొక్క నవినీతులను దెల్పుచు, సాంఘికకల్లోలములను వెలిబుచ్చుచు సాంఘికపరిస్థితులను విపులీకరించుచు, వ్యభిచారమునం దసహ్యత గలిగించుచు, రాఁబోవు చరిత్రకారుల కుపయోగకరమగు నీ కావ్యపు వ్రాఁతప్రతులు దేశమంతటను బ్రబలియున్నను గొంతకాలమునకు నశించు నను తలంపుతో నీకామగ్రంథమాలలో రెండవగ్రంథముగా బ్రకటించి చందాదారులకు నందున ట్లొనర్చుచుంటిమి. కావున చందాదారు లెల్లరు దీనిని భద్రపరుతురని తలంచుచున్నారము.

సంస్కృతమున గల కాళిదాస ప్రహసనమును హాస్యకళానిధి యని మావలన బిరుదము నందిన నవీనకవివరుం డొక్క రాంధ్రమున ననువదించి “లంబోదరప్రహసన”మని నామకరణ మొనర్చి మాకుఁ బంపిరి. కావున కాళిదాసకృతమగు సంస్కృత ప్రహసన మొకప్రక్కను యాంధ్రమున ననువదింపఁబడిన “లంబోదర ప్రహసన” మొకప్రక్కను ముద్రించి యచిరకాలముననే కామగ్రంథమాలయొక్క మూఁడవగ్రంథముగాఁ బ్రకటించి చందాదారుల కెల్లరకుఁ బంపగలమని మనవి సేయుచున్నారము.

ఇట్లు

పుదుచ్చేరి — యస్. చిన్నయ్య

10-6-22 — సంపాదకుఁడు

“కామగ్రంథమాల”

శ్రీరస్తు

# చంద్రరేఖావిలాపము

## ప్రథమాశ్వాసము



కంఠుండు భుజంగభూషణుఁడు భస్మీభూతపంచాస్త్రుఁ డ
స్తోకాటోపబలప్రతాపపురరక్షోదక్షసంశిక్షణుం డా
కాశోజ్జ్వలకేశపాశుఁడు త్రిశూలాంకుండు రుద్రుండు తా
వీఁకం జింతలపాటి నీలనృపతిన్ వీక్షించు నేత్రత్రయిన్. ॥ 1 ॥

ఉ. అక్షయబాహుగర్వమహిషాసురదుర్ముఖచక్షురోల్లస
ద్రాక్షసదక్షులన్ సమరరంగములోనఁ ద్రిశూలధారచే
శిక్ష యొనర్చి శోణిత మశేషము గ్రోలిన దుర్గదుర్గుణా
ధ్యక్షుని నీలభూవిభుని దద్దయు నిర్ధనుఁ జేయుఁ గావుతన్. ॥ 2 ॥

సీ. స్తబ్ధశబ్దగ్రహద్వయుఁడు సంవేష్టితో
త్తాలవాలుండు కరాళవజ్ర
కర్కశదంష్ట్రాక్రకచభయంకరమహా
విస్తృతవక్త్రుండు విపులదీర్ఘ
పటుతరకహకహస్ఫుటచటువికటాట్ట
హాసనిర్దళితవేదాండభాండుఁ
డాలోకకాలానలాభీలవిస్ఫుర
న్నేత్రుండు ఖడ్గసన్నిభనిశాత
గీ. నఖరుఁడు హిరణ్యకశిపువినాశకుండు
సింహగిరివర్తి యగు నరసింహమూర్తి
యడరు చింతలపాటి నీలాద్రినృపుని
సిరియు గర్వం బడంగంగఁ జేయుఁగాత. ॥ 3 ॥

ఉ. నీరదనీలవర్ణుఁడు శునీవరవాహుఁడు విద్యుదాభవి
స్ఫారజటాభరుండు బహుశష్పసమన్వితదీర్ఘమేఢ్రుఁ డం
భోరుహగర్భమస్తకవిభూషితహస్తసరోజుఁ డా మహా
భైరవుఁ డిచ్చుఁగాత నశుభంబులు నీలనృపాలమౌళికిన్. ॥ 4 ॥

చ. అనుపమవిక్రమక్రమసహస్రభుజార్గళభాసమానసా
ధనజితసిద్ధసాధ్యసురదానవదక్షుఁడు దక్షశీర్షఖం
డను డగు వీరభద్రుఁడు గడంకను జింతలపాటి నీలభూ
జనపతిపుంగవు న్విభవసారవిహీనునిగా నొనర్చుతన్. ॥ 5 ॥

చ. నలువగు రక్తమాల్యవసనంబులు డంబుగ దాల్చి కన్నులన్
జలజల బాష్పబిందువులు జాలుకొనంగఁ జెలంగుచుండు న
క్కలుములచేడె యక్క కలకాలము నీలనృపాలు నింటిలో
గలిపురుషానుషంగ యయి గాఢరతి న్నటియించుఁగావుతన్. ॥ 6 ॥

చ. అనుదినవక్రమార్గగతు లై చరియించుచు వైరివర్గముల్
దనరఁ బరిస్ఫురాత్మతను దాలిచి మంగళుఁడు న్గురుండునన్
శనియును రాహువు న్మిగులసమ్మతి ద్వాదశజన్మరాసులన్
గొనకొని నిల్చి నీలనృపకుంజరుని న్గడతేర్తు రెంతయున్. ॥ 7 ॥

కం. భీమకవి రామలింగని
స్త్రీమన్మథుఁడై చెలంగు శ్రీనాథకవిన్
రామకవి ముఖ్యులను ప్రో
ద్దామగతిం జిత్తవీథిఁ దలఁచి కడంగన్. ‖ 8 ‖

వ. ఇట్లు సకలదేవతాప్రార్థనంబును సుకవిజనతాభివందనంబును గావించి యే నొక్క హాస్యరసప్రధానమగు ప్రబంధంబు "సుకవి నికరమనోనురాగసంధాయకంబు"గా రచియింప నుద్యోగించి యున్న సమయంబున.

సీ. తన యపకీర్తి మాద్యత్కృష్ణకోకికి
గురుతరాజాండంబు గూఁడు గాఁగ
తన లోభగుణవినూతనదురాలభలత
కష్టదిశల్ ప్రాకు లై చెలంగ
తన పందతన మను ఘనతమోవితతికి
బహుగృహంబులు శైలగుహలు గాఁగ
తనదు వారత్వచోరునకు సంకరశర్మ
నాటకం బర్థాంజనంబు గాఁగ.
గీ. నవని దీపించుఁ జంద్రరేఖాభిధాన
వారనారీత్రికోణసంవర్ధమాన
రసపరిప్లుతసుఖగదాప్రణకిణాంక
భూషణుం డైన నీలాద్రి భూమిపుండు.

వ. వెండియు నఖండభూమండలమండవాయమాన మానవాధినాథ సాధుయూథ నిర్నిరోధావరోధసభాభవనాభ్యంతరనితాంత వర్ణనీయ కాలకూట కాకకజ్జలఖంజరీటకంబళేంగాలకాలమార్జాల గండోపల ఘనాఘనగంధేభబంభరకదంబ సంభాసమానానూనాం తదిగంతాక్రాంతాపయశోమండలుండును, సుభగుండును, మైరావణ రావణ కుంభకర్ణ కుంభ నికుంభ శుంభ నిశుంభ జంభ హిడింబ ప్రలంబ పౌలోమ బక వత్సక బాణ చాణూర ఘటోత్కచ కాలనేమి ఖర దూషణ త్రిశిర మారీచ మాలి సుమాలి మకరాక్ష ధూమ్రాక్ష శోణితాక్షప్రముఖ రక్షోదక్షసదృక్షాక్షుద్ర నిర్నిద్రద్రాఘిష్టదుర్దమదుర్గుణాధ్యక్షుండును, సర్వావలక్ష ణుండును, కిరాతగుణగరిష్టుండును, దుర్మార్గప్రవీణాస్పదుండును బ్రాహ్మణద్రవ్యభక్షణదీక్షితుండును, బాలరండాకర్షసమాణకు తూహలుండును, నిరంతరానంతదురంతప్రాంతకాంతారాంతరా ళకరాళమార్గానర్గళసంచరద్గవయ గోమాయు గోపుచ్ఛ కురంగ శశ మర్కటోలూక గ్రామసూకరప్రముఖ ప్రకట మృగయా విహారవిశారదుండును, మహోన్మాదుండును, సుకవినికురంబ విద్వత్కదంబవందిసందోహ వైణికశ్రేణికా మనోరథార్థ-న్యర్థీ కరణాసంహారణాకారణానిర్దయస్వాంతుండును, విగతశాంతుం డును, బహువారనారీజనాలింగన దుర్గంధబంధురభగచుంబన తాడనపీడన దంతక్షత నఖక్షత మహిష మార్జాల మర్కట కుక్కుట కృకురప్రముఖబంధనైపుణీగుణగరిష్టుండును, దుర్జన శ్రేష్టుండును, శ్రీమచ్చింతలపాటివంశపారావారఘోరజాజ్వ ల్యమానానూనశిఖాసందోహసందీప్తబడబానలుండును, చల చిత్తుండును, సంగరాంగణభీరుండును, విషయశూరుండును, నీచపాచ కాధారుండును, పరమదుర్బలదుర్భరశరీరుండును, ఆత్మీయదాస

విలాసినిజనమనోధనపశ్యతోహరుండును, పతయాళుండును నగు
నీలాద్రిరాజన్యపుంగవుం డొక్కనాడు. ‖ 11 ‖

సీ. వేఁటవేఁపులు పదివేలు మచ్చికమీఱ
మూతి నాకుచు దండ మొఱుఁగుచుండ
జొమ్ముతప్పెట లూని క్రమ్మి రసాలాలు
జోహారనుచు వేఁటసొంపు దెలుపఁ
దురకనేస్తలు సురాపరిమళం బెసఁగంగఁ
జెవిచెంత మనవులఁ జెప్పుచుండ
రసపొక్కు లడర వారస్త్రీలు ముంగలఁ
దాథై యటంచు నృత్యంబు సలుప.
గీ. వినయ మెసఁగంగఁ గుంటెనపనులు సేయు
సేవకులు దాసికలు డాసి క్రేవ నిలువ
నలరు కొప్పాక గ్రామసింహాసనమున
గడఁక దళుకొత్తఁ బేరోలగమున నుండి. ‖ 12 ‖

మ. సరసాగ్రేసరుఁ గూచిమంచికులభాస్వద్వార్ధిరాకావిధున్
జిరకీర్తిన్ బహుళాంధ్రలక్షణవిదున్ శ్రీమజ్జగన్నాథసు
స్థిరకారుణ్యకటాక్షలబ్ధకవితాధీయుక్తునిన్ జగ్గరా
డ్వరనామాంకితు నన్నుఁ జూచి పలికెన్ వాల్లభ్యలీలాగతిన్. ‖ 13 ‖

సీ. రచియించితివి మున్ను రసికు లౌనని మెచ్చ
సురుచిరజానకీపరిణయంబు
వచియించితివి కవివ్రాతము ల్పొగడంగ
“ద్విపద” రాధాకృష్ణదివ్యచరిత
ముచ్చరించితివి విద్వచ్చయంబు నుతింపఁ
జాటుప్రబంధముల్ శతకములును
వడి ఘటించితివి నిరువదిరెండు వర్ణనల్
రాణింపఁగా సుభద్రావివాహ
గీ. మాంధ్రలక్షణలక్ష్యంబు లరసినావు
భూరిరాజన్యసంప్రత్ప్రపూజితుఁడవు
భళిర నీ భాగ్యమహిమ చెప్పంగ దరమె
జగ్గరాజకవీంద్ర వాచాఫణీంద్ర. ‖ 14 ‖

ఉ. అర్ణవమేఖలం గల మహాకవికోటులలోన నెంతయున్
బూర్ణుఁడ వీవు సత్కవిత బూఁతులరీతుల గోరుకొండగా
వర్ణనసేయనేరుతువు వాతెముఁ జుల్కఁగఁ బల్కు మూర్ఖులన్
దూర్ణమె తిట్టి చంపుదువు ధూర్తవు, పౌరుషశాలి వెంతయున్
నిర్ణయ మిత్తెఱం గెఱిఁగి నేర్పున నిన్ను బహూకరించినన్
స్వర్ణవిభూషణాంబరగజధ్వజచామరగోధనాశ్వదు
ర్వర్ణవిచిత్రపాత్రబహురాజ్యరమారమణీయపుత్రసం
కీర్ణసమస్తవస్తువరగేహసమంచితభోగభాగ్యముల్
కర్ణసమానదానము, నఖండపరాక్రమశక్తి, నిత్యదృ
క్కర్ణకులీనవాగ్విభవగౌరవ, మాశ్రితబంధురక్షణో
దీర్ణకృపారసంబును, నతిస్థిరబుద్ధి, చిరాయువున్, సుధా
వర్ణయశంబునున్ గలిగి వర్ధిలఁజేతువు జగ్గసత్కవీ. ‖ 15 ‖

వ. అని యనేకప్రకారంబులం గొనియాడి యీడులేని వేడుకం జం
ద్రరేఖాభిధాన వారవారణరాజయాన యూరుప్రదేశంబున
శిరంబు మోపి పరుండి క్రిందు చూచుచు నా రాజాత్మజుం డిట్లనియె. ‖ 16 ‖

క. వేంకటశాస్త్రులు మాకు న
లంకారగ్రంథ మొకటి లలి సురభాషన్
బంకించె నాంధ్రకావ్యం
బంకిత మొనరింపు మీవు నట్లనె మాకున్. ॥ 17 ॥

క. అని మున్ను సత్ప్రబంధం
బొనరింపుమటంచు జెప్పియుంటిమి వెస న
ట్లనె రసముగ జెప్పితి వది
గొన నిపుడు ధనంబు లేదు కొదువ లభించెన్. ॥ 18 ॥

సీ. విను మదియెట్లన మనుజులు నామీఁద
బిట్టుగఁ జలమూని విజయరామ
ధరణీశుతోఁ జెప్ప దండుగ పన్నెండు
వేలరూపాయలు వేగఁగొనియె
నిచ్ఛాపురంబులో నేనొక్క లంజతో
భోగించి నిద్దుర బోవఁ జోరు
లెలమి డేరా జొచ్చి బలువైన గుజ్జుంబు
వెండిపల్లముఁ బదివేల్వరాల.
గీ. సొమ్ము దొంగిలిపోయిరి సొమ్ముపక్కి
సాటిదేశంబు రాయభూషణుఁడు ద్రొబ్బెఁ
దప్పె భాగ్యంబు నిర్భాగ్యదశ లభించెఁ
దవిలి సత్కృతిఁ గొన పదార్థంబు లేదు. ॥ 19 ॥

తే. సత్కృతులు మున్ను రాజు లసంఖ్యగాఁగ
నంది రవియెల్ల జగతి నందంద యణఁగె
ఘనత జగదేకవిఖ్యాతి గలుగదయ్యె
వ్యర్థమయ్యె బదార్థంబు వారిదెల్ల. ॥ 20 ॥

క. అపకీర్తియు కీర్తియు భువి
నెపుడుం బోకుండు; గీర్తి కియ్యగవలయున్
విపులముగ ధనము; మాకిపు
డుపకారము గాఁగ చెప్పు మొకకృతి సరగన్. ॥ 21 ॥

క. చెప్పిడుము హాస్యరసముగ
గుప్పున ముందెవరుఁ జెప్పకొన విననదిగా
నిప్పుడు నాకును నొప్పుల
కుప్పకు నీ చంద్రరేఖకును ముద మొదవన్. ॥ 22 ॥

క. గంగి సుమీ మును పేరును
భృంగి సుమీ నాట్యకలన పేర్కొన మదుసా
రంగి సుమీ దీనమ్మను
దెంగి సుమీ కామరతుల దిట్టఁడనైతిన్. ॥ 23 ॥

తే. వారకన్యక యని నీవు కేరవలదు
దీనితో నాకు నేస్తంబు పూనఁ జేసి
కడకమై నాడిమళ్ళ వేంకటమనీషి
దీనితల్లిని విషయించు దృష్టికలన. ॥ 24 ॥

క. బోగమువారందఱు న
చ్చో గుంభనమెసఁగ వచ్చిచూడఁగ నతఁడా
యాగాయతనము లో సం
యోగము గావింపఁజేసె నొగి నిర్వురకున్. ॥ 25 ॥

క. ఆతనికిఁ గూఁతు రగుటన్
జాతుర్య మెలర్ప నేర్పె చౌశీతిగతుల్
ఖ్యాతిగ నిది నా మదికిన్
జేతస్సంజాత సుమని శిఖమై నాటెన్. ‖ 26 ‖

ఉ. దీని మొగంబుడంబు మఱి దీని విలంబకుచంబు లందమున్
దీని ఘనోరుకాండయుగ దీర్ఘవికీర్ణసుకేశపాశమున్
దీని మధుప్లుతాధరము దీని మహోన్నతరోమరాజియున్
దీని సుబాహుమూలరుచి తెల్లమ నాకెడఁబాయ వెప్పుడున్. ‖ 27 ‖

ఉ. సానులఁ గూడనో మునుపు చక్కని చిక్కని నిక్కుముక్కు పె
న్యోనులఁ జూడనో కడు సముజ్వల పంకజపత్త్ర విభ్రమా
నూనవిలాసపేశల మనోహరయోనికి సాటి సేయఁగాఁ
గానఁగరాదు వస్తువది కన్నులఁ గట్టిన యట్ల తోఁచెడిన్. ‖ 29 ‖

సీ. చంద్రబింబస్ఫూర్తిఁ జౌకసేయఁగఁ జాలు
ముద్దుఁగారెడి నవ్వుమోముతోడ
కలువరేకులడాలు గడకొత్తగాఁ జాలు
తోరంపు నిడుదకందోయితోడ
కరటికుంభంబులఁ బరిభవింపగఁ జాలు
కర్కశకుచయుగ్మకంబుతోడ
బంధుజీవముల తోడఁ బ్రతిఘటింపగఁ జాలు
రాగసంయోగాధరంబుతోడ.
గీ. సొగసు గులుకంగ నుపరతిఁ జొక్కఁజేసి
కొసరి నా మానసంబెల్లఁ గొల్లలాడి
నన్ను దాసునిగా నేలె నన్నిగతుల
దీని వర్ణింపుమా రసోదీర్ణముగను. ‖ 30 ‖

క. ఎన్ని విధంబుల దెంగిన
తన్నదు తిట్టదు వరాలు ధాన్యము సొమ్ముల్
సన్నపు కోకలు తెమ్మని
నన్నడుగదు యిట్టి వారనారులు కలరే. ‖ 31 ‖

క. భగముబిగి మొగముజిగియును
జిగురాకన్మోవికావిఁ జెప్పఁగఁతదరమా
తగ నన్నును దీనిని గడు
సొగసుగ వర్ణింపవలయు సుకవివతంసా. ‖ 32 ‖

వ. అని యత్యంతప్రేమాతిరేకంబున వేఁడిన నే నిట్లంటి. ‖ 33 ‖

సీ. ఆది పురోహితులైన దేజోమూర్తు
లను గతాయులకడ కనిపినావు
సాధు జయంతి మహాదేవు మాన్యంబు
లెలమి కాసాలంజ కిచ్చినావు
రాయవరంబు మిరాశిదారుల వెళ్ళఁ
గొట్టి కొంపలఁ బసుల్గట్టినావు
ధర్మాత్ముడును దాతతమ్ముఁడు నగు రాయ
విభు నిరుద్యోగిఁ గావించినావు.
గీ. బోయగొల్లాములోఁ గాసు బోకయుండ
వేంకటమనీషి చేత నిరంకుశగతిఁ
గ్రతువు సేయించితివి నీకు గృతి యొనర్ప
నర్హ మగునట్లు జేతు నీలాద్రిరాజ. ‖ 33 ‖

వ. అనినం బ్రహృష్టదుష్టహృదయుండై శిరఃకంపంబు సేయ నేనును
బరమానందకందళితమానసారవిందుండ నై వచ్చి
యతనికి షష్ఠ్యంతంబు లీ ప్రకారంబునం జెప్పంబూనితి. ‖ 34 ‖

క. నీచాధారునకు మహా
యాచక శుక శాల్మలీ ద్రుమాకారునకున్
బ్రాచుర్యవికారునకున్
రాచినృపకులాబ్ధిగరళ రససారునకున్. ‖ 35 ‖

క. క్రూరునకు సాధుబాధా
చారునకు న్యోనిపానసరశీలునకున్
జారునకు విప్రతతిధన
చోరునకున్ బుద్ధిహీన శుభరహితునకున్. ‖ 36 ‖

క. పరనారీభగచుంబన
పరతంత్రున కఖిలదుష్టపాపాత్మునకున్
నిరుపమదుర్గుణశీలికి
ధరలో నీలాద్రిరాజ దౌర్భాగ్యునకున్. ‖ 37 ‖

క. అతిమూఢశీలునకు సం
తతమృగయాఖేలునకును దాసీవనితా
వితతరతిలోలునకు ఘన
పతితకుజనపాలునకును బతయాళునకున్. ‖ 38 ‖

క. దుర్భరతనునకు రండా
గర్భాపాతనవిధానకౌశలకలనా
విర్భూతాపయశునకున్
నిర్భరకలుషాత్మునకును నిర్లజ్జునకున్. ‖ 39 ‖

క. ఆవిష్కృతచంద్రీభగ
దేవీపూజావిధాన ధీసారునకున్
గేవల రణభీరునకున్
భూవలయోద్ధరణ ఘోర భూధారునకున్. ‖ 40 ‖

క. వారవధూసారమధూ
ద్గారివదనచుంబనక్రకచభవ దురువ
క్త్రారూఢ రదనునకుఁ గాం
తారాంతరసదనునకు వితతనిధనునకున్. ‖ 41 ‖

క. చింతలపాట్యాన్వయతత
కాంతారకుఠారునకును ఘనతరచింతా
క్రాంతునకు నీలధరణీ
కాంతునకు న్వ్రీతసుగుణ గణశాంతునకున్. ‖ 42 ‖

వ. అనభ్యుదయపరంపరాభివృద్ధిగా నా యొనర్పం బూనిన చంద్రరేఖా
విలాపం బను సత్ప్రబంధరాజంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన. ‖ 43 ‖

వ. మున్ను శ్రీ శివబ్రాహ్మణవర్ణాగ్రగణ్యుం డగు వీరభద్రభట్టారకేంద్రునకు శ్రీ
మద్వైఘానసవంశోత్తంసం బగు నంబి నరసింహాచార్యవర్యుం డిట్లని చెప్పందొడంగె. ‖ 44 ‖

సీ. బహుళనానావిధపశుకళేబరచర్మ
కంకాళవాలఖురాంకితంబు
మస్తిష్కవల్లూరమాంసఖాదనమోద
కంకవాయసగృధ్రసంకులంబు

సాంద్రక్షతజబిందుసందోహపరిమళ
నృక్షికాక్రిమికీటకాక్షయంబు
పలలాశనానందభరితపరస్పర
కలహహృత్కౌలేయగవయశివము.
గీ. మధురతరమదిరాపానమదభరాతి
ఖేలబాలిశచండాలజాలతాడ్య
మానతూర్యనినాదసమన్వితముదు
రాపవనపల్లి బోయగొల్లావుపల్లి. ॥ 45 ॥

గీ. బోయలును గొల్లలును నందుఁ బొందుఁగూడి
యుండుటను బోయగొల్లయై యూరు వెలసె
మఱియుఁ దద్గ్రామమున నొక మాలపెద్ద
చెఱువుఁ ద్రవ్వించె జనుల కచ్చెరువు గాఁగ. ॥ 46 ॥

వ. అంతఁ గొంతకాలంబునకు. ॥ 47 ॥

క. అప్పారావున కొక కృతిఁ
చెప్ప నతం డడఁగ నందుఁ జేరెను వినయం
బొప్పన్ వేంకటశాస్త్రులు
గుప్పున నతఁ డాడిమళ్ళకులుఁ డెన్నంగన్. ॥ 48 ॥

గీ. వానిఁ బ్రార్థింప నొక పెనుపాకఁ జూప
వాసముగ నందు వసియించి వలనుమీరఁ
గొడుకులును దాను వాఁడిచ్చు కోలుఁ దినుచు
నిడుములకు నోర్చి కాలంబు గడుపుచుండి. ॥ 49 ॥

క. నీలాద్రివిభున కా కృతి
వాలాయము నిచ్చి సిరులు వడయఁగ వలెనం
చాలోల చిత్తమునఁ దా
నాలోచన సేయుచుండె నాత్మజ తోడన్. ॥ 50 ॥

వ. అంత. ॥ 51 ॥

క. కటకపు వేంకటసానికి
విటుఁ డగుటను నూజివీడు విడిచి యచటికిన్
దటుకునఁ గూఁతుం దోడ్కొని
మటుమాయలు పన్నుకొనుచు మచ్చికఁ జేరెన్. ॥ 52 ॥

క. చేరిన దాని నతఁడు గని
కూరిమితోఁ గౌగిలించికొని మక్కువ నా
హారాదికంబు లిడుచును
మారక్రీడలఁ జెలంగి మన్నన నునిచెన్. ॥ 53 ॥

వ. అది యెట్టిదనిన. ॥ 54 ॥

సీ. పుట్టకాల్ సొట్టకేల్ వట్టివ్రేలుంజెవుల్
పట్టులే కట్టిట్టు బిట్టు కదలు
మిట్టపండ్లును బెనులొట్టకన్నవయును
బిట్టులై చుట్టలై నిట్టనిగిడి
దట్టమై బలుకొంగపిట్ట చట్టువలను
గొట్టంగ సమకట్టినట్టి తెలుపు
రెట్టింప నౌదలఁ బుట్టి చెంపలమీఁద
నట్టాడు నీఁకలకట్టచుట్ట.

గీ. తొట్టిపెదవులుఁ దుంపర లుట్టిపడెడు
చట్టికెన యగు నోరును గట్టిలేక
గొట్టుమిట్టాడు బలుజను లుట్టిపడెడు
యోని గలయది వేంకటసాని మఱియు. ‖ 55 ‖

సీ. కల్లు పెల్లుగఁ ద్రావి కాఱుకూఁతలు గూయు
మాలని నైనను మరులుగొల్పు
కాసువీసంబులు వాసిగా లంకించి
జుడిఁగి నెల్లాళ్లలో జోగిఁ జేసి
యిల వెళ్ళఁగాఁగొట్టు నెక్కువ తక్కువ
మాటలాడును వట్టిబూటకములు
వేంకటశాస్త్రుల వేశ్య నెవ్వరితోడ
నవ్వదంచును జనుల్ నమ్మ తిరుగు.
గీ. కూఁతునకు నెవ్వనిం దెచ్చి కొమరు కన్నె
సాయ మిప్పించి యేరీతిఁ బ్రబలు నట్లు
చేసెదవొ యంచుఁ జెవిలోనఁ జెప్పుచుండు
శాస్త్రిగారికి వేంకటసాని యెపుడు. ‖ 56 ‖

క. ఈసరణిఁ దెలుప నాతం
డా సానిం జూచి పలికె నలివేణి! మదిన్
వేసరక తాళి యుండుము
నీ సుతకున్ గూర్మిఁ గూర్తు నీలాద్రినృపున్. ‖ 57 ‖

క. నా కృతికన్యకకును గన
దాకృతి యీ కన్యకకును నతనిం బతిగా
నీకొనఁ జేసిన మనకున్
జేకుఱు భాగ్యం బటంచుఁ జెప్పి రయమునన్. ‖ 58 ‖

ఉ. యాగము పేరుచెప్పికొని యర్థము భూప్రజ వేఁడి తెచ్చినన్
భోగము సేయవచ్చు నిజపుత్త్రసహోదరదారబంధుసం
యోగము గాఁగ నంచు మది నూహ యొనర్చి యతం డఖండమా
యాగుణదూషితాత్ముఁడయి యచ్చొటు వెల్వడి యెల్లభూములన్. ‖ 59 ‖

క. నీచత్వమునకు రోయక
చూచిన నరులెల్ల వేఁడి సుడివడక కడున్
యాచనఁ జేసి పదార్థ మ
గోచరముగ సంగ్రహించుకొని వచ్చి వెసన్. ‖ 60 ‖

ఆ. మాలవాని చెఱువు మఱువునఁ బందిళ్ళు
సాలలును ఘటించి సంభ్రమమున
యాజకులును బెద్దలైన విప్రులఁ గూర్చి
దీక్షఁ బూని నిజసతియును దాను. ‖ 61 ‖

ఆ. కడఁక దక్షిణాగ్ని గార్హపత్యాహవ
నీయవహ్నులందు నిలిపి మంచి
మేఁకపోతుగముల మెదలకుండ వధించి
వెరవు మీఱ నందు వేల్చుచుండి. ‖ 62 ‖

ఆ. ముఖముఁ జూడ వచ్చు మనుజుల కిష్టిష్టి
గాఁగ నన్నమిడఁడు, గదుముఁడనుచుఁ
గొడుకుతోడఁ దనదు కూఁతుమగనితోడఁ
జెప్ప వారు లోభచిత్తు లగుచు. ‖ 63 ‖

క. కొందఱు కొంకింత కూ డిడి
కొందఱకుం గూర లొసఁగి కొందఱ కిడకే
దండన సేయుచు గెంటుచుఁ
గొందఱుఁ దిట్టుచును వెళ్ళఁగొట్టుచుఁ గడఁకన్. ‖ 64 ‖

సీ. పుడమిఱేం డ్లంపిన గుడదధిహైయంగ
వీనముల్ లోనిండ్లలోన దాఁచి
కరణంబు లంపిన కంద పెండలములు
పదిలంబుగా నేలఁ బాఁతివైచి
బ్రాహ్మణు లిచ్చిన బహువిధఫలములు
లోలోనఁ దనదు చుట్టాల కిచ్చి
కోమట్లు దెచ్చిన గురుతరవస్తువుల్
మెల్లమెల్లనఁ దారె మ్రింగివైచి.
గీ. పప్పులో నుప్పు మిక్కిలి పాఱఁజల్లి
నేతిలో నాముదమ్మును నిండ నింపి
పులుసులో గంజి మిక్కిలి కలయబోసి
భక్ష్యములలోన మిరియంపుఁ బదడు కలిపి. ‖ 65 ‖

తే. మంచి బూరెలు పొణకల మాటు వెట్టి
పిండిబూరె లొక్కొక్కముక్క పెద్దవారి
విస్తరులలోనఁ బాఱంగ విసరివైచి
కసరికొట్టిన విప్రు లాఁకటను లేచి. ‖ 66 ‖

క. శపియించుచు నెండలచేఁ
దపియించుచు నేఁటి కేమి తాళుఁ డటంచున్
జపలస్వాంతుం డీతఁడు
కపటపుయజ్ఞంబు సేయఁ గడఁగె నటంచున్. ‖ 67 ‖

క. చప్పట్లు చఱచుకొంచును
ముప్పున నితఁ డేల క్రతువు మొనసి యొనర్చెన్
మెప్పెతనంబున, అర్థము
గుప్పున నిక్కపటవృత్తిఁ గూర్చె నటంచున్. ‖ 68 ‖

తే. జవ్వనంబున వేంకటసాని యధర
మధువు గ్రోలిన రోఁత వో మదిఁ దలంచి
వృద్ధదశ సోమపాన మివ్విధి నొనర్చెఁ
గాని స్వర్గాపవర్గేచ్ఛఁ గాదు సుండు. ‖ 69 ‖

తే. అనుచు జను లెల్ల నిబ్భంగి నాడుచుండి
రంత వేంకటశాస్త్రి యాగాయతనము
ప్రకటముగఁ జూడఁ జింతలపాటి నీల
నరవరగ్రామణి మనంబునం దలంచి. ‖ 70 ‖

క. బోగము మిడిమేళంబులు
భాగవతులు వేఁటకాండ్రు భషకచయంబుల్
మూఁగి తనవెంటఁ గొలువఁగ
వేగంబునఁ దరలి యటఁ బ్రవేశంబయ్యెన్. ‖ 71 ‖

వ. ఇట్లు ప్రవేశించి యవ్విప్రపుంగవు దర్శించి యుడుగర లొసంగి శాలాసమీపంబునం
బటకుటీరాభ్యంతరంబున నిలిచి తదీయ క్రతుమంత్రతంత్రప్రయోగప్రధాన
విధానంబు లాలోకించి హాళిం గనుచుండె; నయ్యవసరంబున. ‖ 72 ‖

సి. విష్ణలోపలి పుచ్చవిత్తులగతిఁ గప్పు
గల గొగ్గిపండ్ల సింగార మడర
విప్పు గల్గిన పేడకుప్పలో బురువుల
చొప్పునఁ గొప్పున సుమము లమర
కప్పుచిప్పలఁ బొల్పుకండ లూడెడి రీతిఁ
జీఁకుకన్నులఁ బుసు లేపుమీఱ
నూతిచెంగట వ్రేలు నునుతంబ కాయల
సరణి పొక్కిలి దండ చన్ను లొప్ప.
గీ. గడ్డిబొద్దు వలెను మేను గానిపింప
బారకట్టల తెఱఁగున బాహు లలర
జనకయాగంబుఁ జూడవచ్చెను ద్రికోణ
సాంద్రతరరోమరేఖ యా చంద్రరేఖ. ॥ 73 ॥

క. ఇటు వలె నచటికి వచ్చెడు
విటకంటకిఁ జూచి చిత్తవిభ్రమ మొదవన్
దటుకున నీలనృపతి హృ
త్పుటమున సోలుచును దానిఁ బొగడఁదొడంగెన్. ॥ 74 ॥

క. జడకుచ్చును మెడహెచ్చును
నడగచ్చును బొచ్చు పెఱిఁగి నలుపగు మేనున్
నిడుద లగు తొడల బెడఁగున్
గడు వలమగు నడుముఁ గలుగు కలి కిది భళిరా. ॥ 75 ॥

క. నిక్కు పొగపిడుత గదరా
ముక్కు; మొగం బెన్నఁ గోతిముఖమున కెనయౌ
బొక్కిలి మొలలో తగు భళి
యక్కజపుం నూనెసిద్దె లౌర కుచంబుల్. ॥ 76 ॥

తే. మోవి పీయూష మూరును కేవలముగ
గవ్వదళసరి పండ్లహా! కలికిమేని
మృదువు కోరింతకంపలఁ గదుమఁ జాలు
చెక్కు లలరారు లోహపునక్కు లౌర. ॥ 77 ॥

ఆ. చూపు కాకిచూపు నేపారు కన్నులు
పిల్లికనులఁ గదుమ నుల్లసిల్లు
స్వరము గార్దభమును పరిహసింపఁగఁ జాలు
మదనసదన మెల్ల మంగలంబు. ॥ 78 ॥

క. ఈ నీటుసాని నెచ్చటఁ
గానము గద మున్ను; నేడుఁ గట్టిగ దీనిన్
బోనీక రతి గలంపక
యే నేక్రియఁ దాళువాఁడ నిఁక నిచ్చోటన్. ॥ 79 ॥

క. భషకకపిచటకగార్దభ
వృషభాదికబంధగతుల వేమఱు దీనిన్
విషయింపక నేలాగున
విషమశరుశరాళి బాధ వీడునె నాకున్. ॥ 80 ॥

సీ. బాలరండలఁ బదివేల మరుల్గొల్పి
కోర్కె దీరఁగ మున్ను గూడినాఁడ
మగవాండ్రఁ బెక్కండ్ర మచ్చిక ల్గావించి
కొంచక రతులఁ జొక్కించినాఁడ

దాసికాజనులకుఁ గాసువీసం బీక
వెసఁ గొల్లవంపులు వెట్టినాఁడ
సానిబోగమువాండ్రఁ జనవుబల్మినిఁ బట్టి
పలుమాఱు రతికేళి గలసినాఁడ.
గీ. కాని యీసోయగమును నీ కలికి మీఁది
ప్రేమమును పెఱచోట లభింపలేదు
మరుని మాయావికారమో మగువ మచ్చు
మందు చల్లెనో నామది మందగించె. ॥ 81 ॥

క. ఈ మాపీ యింతిని నా
కామాతురత మెల్లఁ దీఱ గాఢతరమహా
స్తోమాయత ఖరబంధో
ద్దామత మెఱయంగ దెంగెదను వల పాఱన్. ॥ 82 ॥

శా. పుణ్యంబేదిన నేదనీ, జనులు గుంపుల్గూడి కా దంచుఁ గా
ర్పణ్యప్రక్రియఁ దెల్పినం దెలుపనీ, రాజు ల్మహాదుర్గుణా
గణ్యుం డంచును బల్కినం బలుకనీ, కౌతూహలం బొప్ప నీ
పణ్యస్త్రీమధురాధరోదితసుధాపానంబు గావించెదన్. ॥ 83 ॥

ఉ. చెక్కిలి నొక్కి ముద్దుఁగొని చిక్కని చక్కని గుబ్బచన్నులం
దొక్కట గోరులుంచి జిగియూరువు లంటుచు గోర్కెఁదీరఁగాఁ
గుక్కుటబంధవైఖరులఁ గూడినఁగాక మనోజధాటిచే
నిక్కడ నిల్వఁగాఁదరమె యించుకయున్ బెఱమాట లేటికిన్. ॥ 84 ॥

క. అని యనివారితమోహము
మనమునఁ బెనఁగొనఁగ నతఁడు మఱిమఱి చూడన్
వనితయు నాతనిఁ దప్పక
కనుఁగొని యనురాగ మొదవఁ గడఁక నుతించెన్. ॥ 85 ॥

సీ. పరువంపుఁ బ్రాయంపుఁ దురకబిడ్డనిఁ రీతి
మట్టుమీఱఁగఁ బాగఁ జుట్టినాడు
కులుకుజవ్వనపు బల్గుజరాతిపాపని
వీలుగాఁ బ్రోగులు వెట్టినాడు
ఆఁడుభాగవతుని జాడగడ్డము మూతి
నున్నగా గొఱిగించుకొన్న వాఁడు
డుబుడక్కకొమరుఁడు డుంక నిజారును
బుడమి జీరెడి నగ ల్దొడిగినాడు.
గీ. మడుఁగులో బడ్డ మహిషంబుమాడ్కి మేన
నందముగ మంచిగంద మలందినాడు
భళిర యీ నీలనృపతితోఁ గలయఁ గలుగు
బాలికామణిదే కదా భాగ్య మరయ. ॥ 86 ॥

క. ఖరఘృష్ణిసదృశతేజుఁడు
పరమాత్మజతుల్యరూపశాలి సుభగభా
సురవదనుఁడు హరిసన్నిభ
గురుతరగుణుఁ డిట్టి రాచకొమరుఁడు గలఁడే. ॥ 87 ॥

ఆ. గుహ్యకేశతుల్యగురువైభవుండు పీ
నోరుశాలి సమరభీరుఁ డుర్వి
జనుల నమలుబుద్ధిఁ జనువాఁ డితనిఁ దేఱి
వాసుదేవుఁ డెట్లు చేసెనొక్కొ. ॥ 88 ॥

క. ఆ వాలుఁగన్ను లందము
పీవరభుజదండములును బృథుగండములున్
గేవలశోభాతనుఁ డీ
భూవరుఁ డర్మిలిని నాకు బొజుఁగగు నొక్కో. ‖ 89 ‖

సీ. బూరుగు పెనుమ్రాను పొడవు, గానుఁగఱోటి
వలయదేహము, దాకవంటి నోరు
పెనురసపుం బొల్లిపెదవులు, వలమైన
బుఱ్ఱముక్కును, గ్రొత్త బోడిగడ్డ
మల జ్యేష్ఠకిరవగు వెళుపుమొగంబును,
బొడకంత తలకాయ, కుడితిగూనఁ
బోలెడు బొజ్జయుఁ, బొలసుకన్నులు, లావు
నడుము, రా పాడెడు నడుగు లౌర.
గీ. పెద్దయేనుఁగుకా లంత కద్దుశిశ్న
మిట్టి సౌందర్యనిధి భువిఁ బుట్టఁ జేసె
నట్టి తామరపట్టి నే ర్పరయఁ దరమె
చాలఁ జదివిన వేంకటశాస్త్రికైన. ‖ 90 ‖

క. నా పూర్వపుణ్యఫలమున
నీ పురుషునితోడ నేస్త మెనసినఁ గూర్మిన్
రే పిచ్చెద మా పిచ్చెదఁ
గాపట్యము లేని నిండు కౌఁగి లితనికిన్. ‖ 91 ‖

చ. జడ కటిసీమ దూల, నిడుజన్నులు ఱొమ్మున వ్రేల, గొప్పు వె
న్నడరుచుఁ జిందులాడఁ, బురుషాయితబంధకళాప్రవీణతన్
జెడుగుడు లాడి వీని ఘనశిశ్నపటుత్వమహత్వ మెన్నుచున్
విడువక వీనిఁ గూడి మది వెఱ్ఱి దగుల్కొన జేయు టెన్నఁడో. ‖ 92 ‖

సీ. కూఁతుబుడమ, మర్లమాతంగియాకును
మూత్రంబుతో నూరి ముద్దఁ జేసి
పచ్చిపసుపుతోడ బాగుగా మర్దించి
నూనెతోడను కూర్చి మేన నలుగు
వెట్టిన నుమ్మెత్తవిత్తులు గుండెత
ల్లడపాకు పసరు నుల్లాసముననను
గాల్మడిఁ గలిపి పోకలు దానిలోపల
నానించి యెండించి లోని కిముడ.
గీ. వీడియముతోడఁ బెట్టిన విడువ కితఁడు
బంటు తెఱఁగున నా వెనువెంటఁ దిరుగు
నట్లు సేయఁగ నతఁ డెన్న డబ్బు నొక్కొ
మెల్లమెల్లగఁ గలధనంబెల్ల దొబ్బ. ‖ 93 ‖

క. కొందఱు మలయుక్తముగా
మం దిడుదురు మరులుకొనఁగ మా వారసతుల్
మందతఁ జెందును విటుఁ డటు
నింద గదా యటుల సేయ నృపవర్యునకున్. ‖ 94 ‖

క. ఏలాగు మాట లాడుదు
నేలాగున మరులు కొలిపి యెలయింతును నే
నేలాగు లోలుఁజేయుదు
నేలాగునఁ గలుగు విత్త మెల్ల హరింతున్. ‖ 95 ‖

క. అని చాల జాలినొందుచుఁ
జనుగుబ్బలఁ బైఁట జార్చి చక్కఁగ నొత్తున్
మొనవాఁడిచూపుఁ జూచును
బెనుకొ ప్పటు జాఱఁజేసి బిఱబిఱ ముడుచున్. ॥ 96 ॥

తే. ఆవ ద్రావిన పసరమ ట్లదిది మెలంగఁ
జూచి నీలాద్రిభూపతి సొమ్మసిల్లి
మెల్లమెల్లన తెలివొంది కల్లు ద్రావి
పరవశత నొందు చండాలు పగిదిఁ దోఁచి. ॥ 97 ॥

సీ. వలఁ బడ్డ మీను కైవడి, నిప్పుఁ ద్రొక్కిన
కోఁతి భాతిని, వెఱ్ఱిగొన్న కుక్క
పద్ధతి, గుడితిలోఁ బడిన మూషిక మట్లు,
శ్లేష్మంబులో నీఁగ లీల, సన్ని
పాతి చందంబున, వాతంపుగొడ్డు వి
ధంబున, లాహిరీదళము మిగులఁ
తినిన పాశ్చాత్యుని తీరున, నురి వడ్డ
పక్షి కైవడిఁ, బెనుపాము పగిది
గీ. భూత మూనిన మనుజుని పోల్కిఁ, బెట్టు
మందు మెసవిన మాన్యు మాడ్కి, దేహ
మెఱుఁగ కెంతయుఁ గళవళం బెసఁగ దాని
పైఁ దలం పిడి కన్ను మోడ్పక యతండు. ॥ 98 ॥

క. తలనొప్పియుఁ దాపజ్వర
మలసటయును మిగులఁ బొడమ నసురసు రనుచున్
నిలువంగ బలము చాలక
తలిమముపై వ్రాలి దానిఁ దలచుచు నుండెన్. ॥ 99 ॥

క. అని నంబి నారసింహుం
డనువొప్పఁగ నిట్లు చెప్ప నా తంబళి వీ
రన యావలికథ లెస్సగ
వినయంబునఁ జెప్పు మనుచు వెస వేఁడుటయున్. ॥ 100 ॥

ఉ. నీచచరిత్ర! వారరమణీభగరుక్తతగాత్ర! నిత్యదు
ర్యాచకమిత్ర! సజ్జనపదార్థపరిగ్రహణైకసూత్ర! దు
ష్కాచపిశంగనేత్ర! నృపకర్మమహాలతికాలవిత్ర! శ్రీ
రాచినృపాలగోత్రవనరాశికసద్బడబాగ్నిహోత్రమా. ॥ 101 ॥

భుజంగప్రయాతము. దురాలాపదుర్దోషదుర్మార్గవర్తీ!
ధరామండలఖ్యాతధౌర్త్యా పకీర్తీ!
పరస్త్రీరతాసక్తభావప్రపూర్తీ!
స్థిరాయుస్స్థిరాజాతదీర్ఘోగ్రమూర్తీ! ॥ 102 ॥

గద్యం. ఇది శ్రీమజ్జగన్నాథదేవకరుణాకటాక్షవీక్షణానుక్షణసంలబ్ధసరస
కవితావిచిత్ర సలలితాపస్తంబసూత్ర కౌండిన్యసగోత్ర కూచిమంచి
కులపవిత్ర గంగనామాత్యపుత్త్ర మానితానూనసమాననానావిధరంగ
త్రిలింగదేశభాషావిశేషభూషితాశేషకవితావిలాసభాసురాఖర్వసర్వల
క్షణసారసంగ్రహోద్దామ శుద్ధాంధ్రరామాయణప్రముఖబహుళ
ప్రబంధనిబంధనబంధురవిధాన నవీనశబ్దశాశనబిరుదాభిరామ తిమ్మకవి
సార్వభౌమసహోదర గురుయశోమేదుర వివిధవిద్వజ్జనవిధేయ జగన్నాథ
నామధేయ ప్రణీతంబైన చంద్రరేఖావిలాపం బను హాస్యరసప్రబంధ

శ్రీరస్తు

# చంద్రరేఖావిలాపము

## ద్వితీయాశ్వాసము



రహితగేహ! చంద్రీ
వారవధూమదనసదనవర్ధితసుఖరో
గారూఢితమృదుదేహవ
నీరంగవిహారసాంద్ర! నీలనరేంద్రా! ॥ 1 ॥

వ. ఆకర్ణింపుము తావకీనకథావిధానంబు యథార్థంబుగాఁ దొల్లి శ్రీ శివబ్రాహ్మణవర్ణాగ్రగణ్యుం డైన వీరభద్రభట్టారునకు శ్రీ మద్వైఖానసవంశోత్తముం డగు నంబి నరసింహాచార్యుం డవ్వాలి కథ యిట్లని చెప్పందొడంగె. ॥ 2 ॥

క. అక్కమలేక్షణ యది గని
చిక్కెంబో వీడు నాదు చేతి క టంచున్
నిక్కుచుఁ దల్లికడకుఁ జని
మక్కువ నక్కథ యెఱుంగ మఱువునఁ దెలుపన్. ॥ 3 ॥

వ. ఇట్లు దెలుప వేంకటసాని యిట్లనియె. ॥ 4 ॥

క. నీ తండ్రి క్రతువు కనుఁగొన
నాతతగతి నీలనృపతి యరుదెంచి నినున్
రాతిరి గని మోహించుట
లాతులలోఁ దేనె పుట్టిన ట్లయ్యె గదే. ॥ 5 ॥

క. ఏ మేమి! నీలభూపతి
నీమీఁదం గన్ను వైచి నిష్ఠురజవవ
త్కామశరజాలనిర్దళి
తామేయస్వాంతుఁ డయ్యెనా? మేలుభళీ! ॥ 6 ॥

క. కూఁతుర, యాతుర పడి నీ
వాతనిఁ జేరంగఁబోకు, మటుతాళుము, వాఁ
డేతెంచు సంచులను ధన
మాతతగతి నించుకొంచు వ్యామోహమునన్. ॥ 7 ॥

క. వలపెంత నీకుఁ గలిగినఁ
గులధర్మము తప్పరాదు కుమ్మరపురువుం
బలెఁ దిరిగి పొట్టఁ బెంపఁగ
వలెఁ జుమ్మా ముద్దుగుమ్మ వగ నాయమ్మా. ॥ 8 ॥

వ. అని యనేకప్రకారంబుల లాలించి మేలెంచి తనకాలంబు నాఁటి నాటకంబులు బూటకంబులు బోటిదనంబులు నీటులు కూటం బులమాటలు చాటుమాటు లేక తేటతెల్లంబుగా నబ్బోటితోఁ జాటం దొడంగె. ॥ 9 ॥

క. వేంకటశాస్త్రులవంటి ని
   రంకుశులను మరులు కొల్పి యర్థము చాలన్
   లంకించి నాకు నమ్మిన
   కింకరులుగఁ జేసికొంటిఁ గిమ్మనకుండన్. ॥ 10 ॥

క. మున్నెంత వాఁడు వేఁడినఁ
   గన్నెఱికం బీక మీఁదుగట్టితి నీకై
   మన్ననఁ గైకొమ్మని విటు
   లన్నిత్యము మాయచేసి లంకింతు వరాల్. ॥ 11 ॥

ఆ. ఒకఁడు గానకుండ నొక్కని రావించి
   యొకనిచెంత కేఁగుచుండి నడిమి
   దారి నొకనిఁ గూడి తబ్బిబ్బు గావించి
   ధనము కొల్లగొందుఁ దవిలి ముందు. ॥ 12 ॥

క. మందుల మంత్రంబులచే
   విందులచేఁ బూఁతచేత వీడెంబులచే
   తందనపదముల నాటల
   మందులఁ గావించి విటుల మానక దోఁతున్. ॥ 13 ॥

ఉ. అందలము ల్పతాంగములు నశ్వచయంబులు పాలకీలునున్
   మందరశైలరాజనిభమత్తగజంబులు వెంటనంటి రా
   ముందఱఁ బొందుగా ధనము మూటలు మేటులు కాన్క లంపి నా
   మందిరసీమఁ గాతు రసమాననృపాలకుమారు లెప్పుడున్. ॥ 14 ॥

క. నీ కేమి చెప్పవలయును
   లోకు లెఱుంగుదురు నాఁటిలో మదనుఁ డహా
   నా కనుసన్నల మెలఁగును
   కాకుండిన నింతసొమ్ము గడియింతు నఁటే. ॥ 15 ॥

క. అప్పారాయని సభలో
   మెప్పొందితి సాటి సానిమేళంబులలో
   చెప్పినఁ బగ్గెగ నీ మది
   కిప్పుడు తోఁచును, మఱెవ్వ రిచ్చుట సాక్షుల్. ॥ 16 ॥

క. చెలమకుఁ బిట్టలు చేరెడు
   పొలుపున నా యింటిచుట్టు భోగాభిరతిన్
   పలుగు గులాములు తురకలు
   వలగొని కానుకలు గొనుచు వత్తురు సుమ్మీ. ॥ 17 ॥

క. కట్టిన కోకలు కట్టక
   పెట్టిన మణిభూషణములు పెట్టక సిరులం
   దొట్టి విటకోటి కొలువఁగ
   దిట్టతనంబునను గొలువు దీర్తుఁ గడంకన్. ॥ 18 ॥

క. జూదంబులఁ బటువీణా
   నాదంబుల దండలాస్యనటనముల మతుల్
   భేదించి విటజనంబుల
   చే దండుగఁ కొందు ధనము చెప్పఁగ నేలా. ॥ 19 ॥

సీ. వలిప చెంగావిపావడ కటిస్థలిఁ దాల్చి
            జిలు గైన సరిగంచుచీర కట్టి
   కులుకుగుబ్బలమీఁద మలయజాతము పూసి

కట్టువాపని కంచుకంబు దొడిగి
లీలగా సిగ వేసి పూలదండలు చుట్టి
ముత్యాలతాటంకములు ధరించి
కడియాలు కుంటేళ్ళు గంట లొడ్డాణంబు
బవిరలు బావిలీల్ బన్నసరులు.
గీ. నుంగరంబులు కెంపులు ముంగరయును
మొదలుగల సొమ్ములను దాల్చి మురిపె మమరఁ
దిరుగుచును విటకోటుల ధృతి కలంచి
హొన్నులు గడింతు మరునాన చిన్నదాన. ॥ 20 ॥

క. నా వగ నా యొసపరినడ
నా వాలుంజూపుకోపు నా మాటలతీ
రావంతయు నీ వెఱుఁగ వ
హో వన్నెలకానికూఁతురా యిది మేరా. ॥ 21 ॥

క. చండ్లు పడెఁ బండ్లు కదలెను
గండ్లకుఁ జత్వార మొదవెఁ గాయము ముదిసెన్
గోండ్లును భగమును బిగి చెడి
దిండ్ల తిరుగు నేర్పు తప్పె ధృతి మఱపూనెన్. ॥ 22 ॥

క. వృద్ధత్వ మివ్విధంబున
సిద్ధించెను గాని యిపుడు చిల్లరవిటులన్
బద్ధానురాగులుగ అని
రుద్ధజనకుఁగేళిఁ దేల్చిరో వెలఁ గొననే. ॥ 23 ॥

తే. కాన నీవును నావలెఁ గాముకులను
వంచనము చేసి విత్తమార్జించవలయుఁ
గాక యాతనిపై మోహకాంక్ష పూనఁ
జనునె వాఁ డెంత సౌందర్యశాలి యైన. ॥ 24 ॥

మ. అసదృక్కాముకుఁ డౌటచే తను దదీయాంగంబునం దెంతయున్
రసపొక్కు ల్బలుబిళ్లలు న్బహుళఘోరస్ఫారజాగ్రత్ప్రమే
హసుఖవ్యాధులు మానకుండును సదా హో వాని పొం దూనినన్
వెస నంటుం గద నీ భగస్థితి భయావిర్భూతభావంబునన్. ॥ 25 ॥

క. అది చెడుట నీవు చెడుటయె
కద యెవ్వరు నిన్నుఁ దేఱి కనుఁగొనకయె న
వ్వుదు రొక కాసు నొసంగరు
తుది నీ బ్రతు కేమి యగునొ తోఁచదు నాకున్. ॥ 26 ॥

ఆ. అనుచు బోధ సేయునట్టి మాయలమల్లి
బేసబెల్లి వగలవేసవెల్లి
నులిపి తెగులుబొల్లి నుల్లసిల్లెడు తల్లిఁ
జూచి యా బొజుంగుఁజోటి పల్కె. ॥ 27 ॥

క. అమ్మా నా మానస మిపు
డమ్మానిసిఁటేనిమీఁద నంటి వదల దిం
కిమ్మాడ్కిఁ జెప్ప చేటికిఁ
బొమ్మా మరుచేతికీలుబొమ్మా సరగన్. ॥ 28 ॥

క. ధన మేమి బ్రాఁతి నా కది
ఘనమే ఘనమేచకప్రకటకచ వాఁడే

పెనుమేటిపెనిమిటి గదా
వినుమే నిక్కంబు విన్నవించెదఁ దల్లీ. ‖ 29 ‖

ఆ. పెల్లు కల్ల లల్లి బొల్లిమాటలఁ జల్లి
మెల్లమెల్ల నిల్లు గుల్లసేయు
తల్లి గలుగు లంకె నుల్లోలమతిఁ జేరు
పల్లవులకు సౌఖ్య మిల్ల జగతి. ‖ 30 ‖

క. రమ్మంచును నమ్మించును
బొమ్మంచుం గోక లాగు పోఁకల్ రూకల్
క్రొమ్మించు సొమ్ము లెమ్మిం
దెమ్మంచును లాగు లంజె తెగి విటవరులన్. ‖ 31 ‖

సీ. లఘువర్ణ గురువర్ణ లక్షణం బరయక
సరసపదార్థముల్ సంగ్రహించి
వృత్తభంగమునకు వెఱపింతయును లేక
గణనిర్ణయనిరూఢి ఘనత గనక
యపశబ్దములకు రోయక సంధివిగ్రహ
ప్రాణహానివిచారపరత దక్కి
భావం బెరుంగక పండితోత్తములతోఁ
గలయ నొల్లక మహాకపట మూని.
గీ. యతులఁ బోనాడి మూర్ఖసంగతి వహించి
తిరుగు వెలబోటి జీవనస్థితి గణింపఁ
గుకవికృతకావ్యరూపానుగుణతఁ బూని
యరసి చూచిన నిస్సారమగును బిదప. ‖ 32 ‖

క. లంజెయును బీఱకాయయు
ముంజెయు బాల్యమునఁ జాల మోహము గొలుపున్
రంజన చెడి ముదిసిన వెను
కం జూడరు ముట్టఁబోరు గద నరు లెందున్. ‖ 33 ‖

చ. పలువలు చెంతఁ జేరి యొక పాతికనేబులు చేతికిచ్చి ఛీ
మొలఁగల బట్టవిప్పి తగ ముందుగఁ బాన్పున నుండి వార లే
పలుగుఁదనంపుఁ గూటముల బాధలు పెట్టిన నోర్చి పూనికన్
గులుకుచు నుండు నప్పడుపుకూటివెలంది కొలంబుపెద్దయే. ‖ 34 ‖

సీ. పరధనాకర్షణప్రాంతంబు స్వాంతంబు
వ్యర్థమాయావచోవ్యసనరచన
శఠవిటోచ్ఛిష్టాదిసదనంబు వదనంబు
పలుబొజుంగులచొంగఁ బావి మోవి
పల్లనభయదకృపాణులు పాణులు
కుటిలాఘవితతులకోపు చూపు
కృత్రిమగుణగణగేహంబు దేహంబు
షిద్గసంఘంబుల సెజ్జ బొజ్జ.
గీ. పంచసాయకరోగప్రపంచఘోర
యాతనాదూయమానప్రయాతవిటప
మదసలిలయుక్త మగు దోని మలపుయోని
కనుఁగొనఁగ వేశ్య హేయభాజనము గాదె. ‖ 35 ‖

తే. ఇట్టి వేశ్యాకులంబున దిట్ట వైన
నీకు జనియించి యిన్నాళ్ళనేకవిటులఁ

బలుతెఱంగుల బాధించి బహుధనంబు
గూర్చి తిఁక నిప్పడుపుఁగూడు గుడువ నొల్ల. ‖ 36 ‖

క. పట్టి నని నన్ను దయఁ జే
పట్టి యతనిఁ దెచ్చి కూర్చి బహుభాగ్యంబుల్
గట్టిగఁ గొన నొల్ల వయో
కట్టిఁడివి గ దమ్మ లేచి కడ కటు పొమ్మా. ‖ 37 ‖

క. మాతా జామాతపయిన్
బూతులపాఁతఱలు దీసిపోయుదు రటవే
ఖ్యాతా సద్గుణగణసం
ఘాతా పూతా విలాస కలనోపేతా. ‖ 38 ‖

మ. చతురున్ బుణ్యజనున్ సదాగుణయుతున్ సౌందర్యశోభాసమ
న్వితునిన్ జింతలపాటివంశభవునిన్ నీలాద్రినామప్రజా
పతి ని ట్లూరక నింద సేసెదవు నా పట్టూనలే కయ్యయో
మతి దప్పెంగద నేఁడు నీకు జననీ మాయామయోద్యోగినీ. ‖ 39 ‖

క. ఏలాగున నైనను నే
నీలాద్రినృపాలుఁ జేరి నెయ్యు మెలర్పన్
లీలాలోలత నుండుదుఁ
జాలును నీలంజెజాతి సంబంధ మిఁకన్. ‖ 40 ‖

క. అని తల్లిమీఁదఁ గనలుచుఁ
గనుఁగొనలను బాష్పవారి కడువడి జాఱన్
జని నిజశయ్యాతలమున
దను వొయ్యనఁ జేర్చి యతనిఁ దలఁచుచు నుండెన్. ‖ 41 ‖

క. అత్తఱిఁ జంద్రిని జిత్తజుఁ
డత్తి మహోన్మత్తసాయకావళి క్రోధా
యత్తమతి నింప బెం పఱి
పత్త చిరిఁగి సిండవిఱిగి పడి మూర్ఛిల్లెన్. ‖ 42 ‖

ఆ. ఆర్చి పేర్చి మారుఁ డారీతి నేచంగఁ
గూర్చి కూర్చి సొడుఁ గార్చుకొనుచు
మూర్ఛఁ దెలిసి తనదు ముంజేయి యోనిలో
దూర్చి యతనిఁగూర్చి దుఃఖపడుచు. ‖ 43 ‖

ఉ. హా యతిసారసుందరతరాంచితవిగ్రహ! నిన్నుఁ జూచి నే
నాయతమోహపాశవశ నైతిని సన్నకసన్న నిప్పుడే
డాయఁగ వచ్చి నా భగతటస్ఫుటఘట్టితపంచసాయకా
మేయశిలీముఖచ్ఛటల మీటి రమింపుము నీలభూవరా. ‖ 44 ‖

క. వారస్త్రీలకు మెచ్చగు
మారుండ వఁటంచు జనులు మఱిమఱి యెన్నం
గా రూఢిగ వినియుందు ను
దారవిరహతాప మార్పఁదగదే నీకున్. ‖ 45 ‖

క. చూచినయప్పుడె పైఁబడఁ
జూచి మరులుకొంటి వారసుందరి నగుటన్
నీ చతురకార్యపద్ధతు
లే చొప్పున నొప్పు ననుచు నెంతయుఁ బ్రేమన్. ‖ 46 ‖

క. వాచె మొగంబు భగంబును
నీ చరణము లాన యింక నీ విట నాకున్
గోచరుఁడవు గమ్ము వెసన్
రాచినృపకుమార వారరమణీమారా. ‖ 47 ‖

క. వలరాజుచేత యాతన
బలువయ్యెను దాళఁజాలఁ బ్రత్యక్షుఁడవై
చెలిమిని రమింపు మిందున్
గులుకుచు నీలాద్రిభూప కోమలరూపా. ‖ 48 ‖

క. చల మేటికి రాకొమరులు
బలువుగఁ జూడంగ నాదు పజ్జను వేగన్
గులు కొప్పు వచ్చి భగము బ
గల దెంగుము చండ్లు పట్టి కసి దీరంగన్. ‖ 49 ‖

క. సొమ్ములు కోకలు రూకలు
తెమ్మని నినుఁ జిక్కుసేయ; దీకొని ఖరబం
ధమ్మున దెంగుము వడిగా
నమ్ముము పెక్కేల వారనారీలోలా. ‖ 50 ‖

క. చలమేటికి రమ్మిఁక కో
మలరూప పిశంగనేత్ర మన్మథబాధల్
తలగంగ మనసుఁ దీరఁగ
బలువుగ దెంగంగ నాదు పజ్జకు వేగన్. ‖ 51 ‖

వ. అని మహోన్మాదావస్థచే దేహస్వాస్థ్యంబు లేక చీకాకు
పడుచు దుర్గంధబంధురంబై గొఱ్ఱెముక్కు వలె ననవరతంబు ద్రవించు
తన యుపస్థం జూచి యుపస్థతో ని ట్లనియె. ‖ 52 ‖

ఉ. పమ్మినవేడ్క వ్రాఁతపని పావడ పైకెగఁదీసివైచి చొ
క్కమ్ముగ గుద్దక్రింద నొక కమ్ములదుప్పటి నెత్తు వెట్టి మే
ఢ్రమ్ము నిగుడ్చి లోనికి దడాలున నంచులు మోయ దూర్చి నీ
తిమ్మిరిఁదీఱ వాఁ డెపుడు దీకొని తాఁకునొ యో త్రికోణమా. ‖ 53 ‖

ఉ. ఎందఱు పొందుఁ గూడి విషయించిన నిర్ద్రవమై నితాంతమున్
కెందలిరాకుడాల్మోయలు గీల్కొనఁ బొంగుచు దెంగుమంచు లో
గందకఁ దీటతీఱక వికాసత నొందెడు నీకు దృప్తిగా
మందుఁడు నీలరా జెపుడు మగ్గమువెట్టునొ యో త్రికోణమా. ‖ 54 ‖

క. ఆకా? పోకా? రూకా?
కోకా? మేకా? మఱేమి గొని యిచ్చెను తా
నీ కాతనితో నేపని
పూకా! యీకరణి నేల పొరలెద వయయో! ‖ 55 ‖

సీ. తురకలమొడ్డలు దూదేకుమొడ్డలు
గుల్లాపుమొడ్డలు గొల్లమొడ్డ
లాబోయమొడ్డలు యలకాపుమొడ్డలు
చాకలిమొడ్డలు సాలెమొడ్డ
లబిసీలమొడ్డలు పబువులమొడ్డలు
బాపనమొడ్డలు భట్లమొడ్డ
లింగలీజులమొడ్డ లీడిగమొడ్డలు
పింజారిమొడ్డలు బేస్తమొడ్డ.
గీ. లెన్ని దూరించి దెంగిన నించు కైన

జడియకుండెడిదాన వాశ్చర్య మిపుడు
నీలనరపతి చచ్చుమొ డ్డేల నీకు
కాంక్ష గైకోకు మో దోసకారి పూక! ‖ 56 ‖

ఆ. త్రుళ్ళిపడియె దేల చిల్లిలోపల వాని
చుల్ల వెట్టి నిన్ను గిల్లికొనుచు
నల్లిబిల్లి దెంగ నుల్లసిల్లెదవు నీ
రుల్లిపాయచాయ గొల్లికాయ. ‖ 57 ‖

వ. అని మఱియు మనోజాతనిశాతచూతసాయకవ్రాతఘాత
యాతనాధూతచేతోరవింద యై, కంది కుందుచుఁ, గొందలంబందుచు,
వైవర్ణ్యంబుఁ జెందుచుఁ, బాన్పుపయిఁ బడుచు, బొరలుచు,
లేచుచు, వంగుండుచుఁ, దొంగుండుచు, దెంగుండు దెంగుం డనుచు,
వెక్కివెక్కి యేడ్చుచు, వెడవెడం గన్నులు తేలవేయుచు, విహ్వ
లించుచు, విసువుచు, విన్నంబోవుచు, వీణం బాణుల ముట్టక, బట్ట
కట్టక, బోనంబు మెసవక, సురాపానంబు సేయక, ప్రాఁతబొజుంగులం
బలుకరింపక, నాయాసంబు పొందుచు, నారాటంబునం గుందు
చుఁ, జింతించుచుఁ, జేతులు పిసికికొనుచుఁ, జిన్నబోవుచు, సీత్కా
రంబు సేయుచుఁ, జిడిముడి వడుచుఁ, జీకాకు నొందుచుఁ, జెమ్మటలన్
దోగుచుఁ, బలవరించుచుఁ, బండ్లు కొఱుకుచు, బైలు కౌఁగిలించుచుఁ,
బరవశం బగుచు, బెంగ కొనుచు, బిసరుహాంబకుం దిట్టుచు, బిరబిర
శరీరం బెఱుంగక మరుమందిరంబునం గిరికొని గాఢంబులై వంకరలై
వరలు నిడుదసొగ హొరంగు మెఱుంగు వెండ్రుకలు దెగలాగి పాఱవై
చుచు, నలుదిక్కులు కలయం జూచుచు, నవ్వుచు “హా! నీలాద్రి నర
పాలపుంగవా! వచ్చితే!” యని లేచి “నా కుఱువుపయిం గూర్చుండు”
మనుచుఁ, బరిపరివిధంబుల మతిదప్పి, వెఱ్ఱిగొనిన వేఁపి తెరంగున,
నాలి సాలెపురువు చందంబున, మగ్గంబులో నాడెడి నాడెకైవడి,
మధుపానంబు చేసిన వానరంబుపోలిక, మావి కఱుచు నక్కటెక్కునఁ,
బిడుగు మొత్తిన జనునిచందంబున, మూఁగలాగున, ముల్లెపోయి
పొరలు ముండవిధంబున, ముక్కుచు, మూల్గుచు, ముఱికిపిత్తులు
పిత్తుచు, మూఁకుడువంటి మూత్రద్వారంబు మొగి విప్పుచు, ముడుచుచు,
మొగంబు దిగవైచుచు, మూర్ఛిల్లుచుఁ, దెలియుచు, మోహదాహాతి
తాపంబునం దల్లడిల్లుచుండె; నయ్యవసరంబున. ‖ 58 ‖

క. వేంకటసాని కి దంతయుఁ
గింకరు లెఱిఁగింప, దుఃఖకీలితమతి యై
కొంకుచుఁ గూఁతురి నునుప
ర్యంకము చేరంగఁబోయి హా హా యనుచున్. ‖ 59 ‖

తే. బిడ్డరో నీకు మునుపుండు నడ్డగరలు
పెక్కుమాఱులు తగిలిన స్రుక్కకీవె
మాన్పుకొంటివి యిటువంటి మమత నాఁడు
కలుగదయ్యెను వట్టి దుష్కర్మ మొదవె. ‖ 60 ‖

క. ఆరయ నీలనృపాలుని
పేరును బెంపేమి? యతని పెద్దలు మున్నే
తీరున నుండిరి? యీ సిరి
వీరాగ్రణి విజయరామవిభుఁ డొసఁగెఁ గదా! ‖ 61 ‖

తే. ఇంతెకాని, జమీందారుఁ డే యతండు?
పరమమూర్ఖుండు బహులోభి పాపచిత్తుఁ

డాత్మదాసిరతుఁడు వాని కాస చెంద
నిహపరసుఖంబు లేదు నీ దేటి వలపు? ‖ 62 ‖

ఆ. ఎదురు వెట్టి వేడ్కఁ జదరంగ మాడెడు
పగిది నీకుఁ గల్గు పడుపుఁగూటి
సొమ్మెసంగి చేరరమ్మన్నఁ గైకొను
నట్టివాఁడు ముద్దుపట్టి వినుము. ‖ 63 ‖

సీ. పండ్లు తోమఁడు గుదప్రక్షాళనము సేయఁ
డమవసనాఁ డైన హరిదినంబు
నం దైనఁ గడు నూరబందిమాంసము లేక
కూడు భుజింపఁడు గురుముఖంబు
గాఁడు తమ్ములఁ జేరనీఁడు సత్కవులకు
వైశ్యుల పెండ్లిండ్లవలన వచ్చు
కట్నముల్ తా దురాగ్రహమున లంకించి
లంజెల కిచ్చును లజ్జమాలి.
గీ. వినయమునఁ దండ్రి తద్దినముననువిప్రుఁ
బిలిచి యొకకాసు తవ్వెడు బియ్య మీఁడు
పతితుఁడును లోభి చింతలపాటి నీల
రాజు, ఛీ ఛీ యతనిమీఁద మో జదేల? ‖ 64 ‖

ఉ. పూచిన శాల్మలీద్రుమముఁ బోలిన లోహితదీర్ఘదేహమున్
గాచసమానపీతరచిఁ గ్రాలెడు కొంచెపుఁ గన్నుదోయి జ్యే
ష్ఠాచపలాక్షి వ్రేలెడు విశాలతరాస్యముఁ గల్గువాని సం
కోచములేక చూచి వలగొంటివె? వారవధూశిరోమణీ. ‖ 65 ‖

క. సానులకు గబ్బిబెబ్బులి
పూని కనుంగొనినవాఁడు పోనీఁడు గదే
హాని యొనరించు హా! రతి
కూన! సరగఁ బాఱిపొమ్ము కొట్టామునకున్. ‖ 66 ‖

తే. నల్లమందును గంజాయి కల్లుఁబోతు
పిచ్చుకల మెక్కి నిను వాఁడు పిత్త దెంగు
పత్త చినిఁగిన విడువఁడే పాపి వాని
దుడ్డువలె నుండు మొడ్డపై దుంగ లెత్త! ‖ 67 ‖

క. కుత్తయు పత్తయుఁ జినఁగగ
మొత్తును మత్తిల్లి నీదు మొడ్డకు దండం
బొత్తకు మని వేఁడిన వినఁ
డత్తులువబొజుంగు వాని కాసింతు రటే? ‖ 68 ‖

క. పాపి విను వట్టియాసలు
చూ పియ్యఁడు డబ్బు లంజెసొమ్ము భుజించున్
పాపాత్ముఁడు పశుకర్ముఁడు
మా పని రే పని భ్రమించి మగ్గము నెట్టున్. ‖ 69 ‖

క. పిచ్చలు వడివడి రాయఁగ
గుచ్చులు మెయ్యంగ వాఁడు గొనకొని తాఁకున్
గచ్చంత పగిలి సలుపుచుఁ
జచ్చేవే చంద్రరేఖ సాంద్రసురేఖా. ‖ 70 ‖

క. పెద్దల నెఱుఁగఁడు మాటలఁ
బద్దులు పచరించు గర్వి భామ కురతిలో

నెద్దువలె మెలఁగు నీ కా
బుద్ధి వలదు మాను మమ్మ పుత్తడిబొమ్మా. ‖ 71 ‖

క. ఖలుఁడైన నీలనృపుఁ డీ
యిలపై నిన్నాళ్ళు బ్రతుకునే నరసాంబా
గళకలితకనకమయమం
గళసూత్రోత్కృష్టమహిమ గాక కుమారీ. ‖ 72 ‖

తే. రొక్క మిచ్చెడు విటుఁ జూచి దక్కినట్లుఁ
దక్కుచును బొల్లిమాటలఁ దనుపుఁ; గాని
నిక్కముగ మానసం బీయ నిశ్చయించి
వారకన్యక యీరీతి వలచు నటవె? ‖ 73 ‖

క. ఎక్కడి నీలాద్రినృపుం
డెక్కడి యడియాస వలపు లివి కూడ విఁకన్
గ్రుక్కినపేను తెఱంగునఁ
గిక్కురుమనకుండఁ జనుము గేహంబునకున్. ‖ 74 ‖

వ. అని వినయవిస్రంభగంభీరసంరంభంబులు గుంభింప పలుక,
నచ్చిలుకలకొలికి కంతకంతకు వింతవింతలుగ దురంత నితాంత విప్ర
లంభ వేదనాభరంబు భరింపరాకుండ కరంబు దళంబుగా బరవశ
త్వంబు నొంది మారుమాటాడ నోడి, ఓడిన కోడి చందంబున
తల వ్రేలవైచుకొని, కదల మెదల నేరక కన్నులు మూసికొని, యూరక
శరీరంబు నీరు విడువ శయ్యా నొయ్యన వ్రాలి తూలం కనుంగొని
బెంగను లొంగి దుఃఖాంభోధి మధ్యంబున మునింగి కన్నీరు లేఱులై
పారి వెల్లివిరియ డిల్లపడి తల్లడంబున నుల్లంబవియ మెల్లమెల్లన
నప్పల్లవ మనోభూతంబున కాతతగతి చల్లనిపనులు సేయందలంచి
తన దాసికాజనంబులుం దానును దాని నిజశయ్యాతలంబునం జేరి. ‖ 75 ‖

సీ. భగమధ్యమున మంచిచిగురుప్పుఁ గూరించి
పైఁ గొండనల్లేరు ప్రస్తరించి
లంబస్తనప్రదేశంబున రేవడి
దూలగొండిచిగుళ్ళు గీలుకొలిపి
కన్నులలోన నర్కక్షీరములు నించి
ముక్కుగూండ్లను ఆవముద్ద లుంచి
వీనులలోపల వేఁడినూనియ పోసి
నాలుకఁ జెముడుపా ల్చాలఁ బొడిచి.
గీ. మేన ఱాసున్న మెంతయు మెత్తి, నెత్తి
గొఱిగి, నిమ్మపులుసు గంట్లఁ గ్రుమ్మి, లోని
కిముడ నేపాళము లొసంగి యిట్లు శిశిర
కృత్యములు సేయ, అప్పు డక్కితవవనిత. ‖ 76 ‖

క. బడబడఁ బిత్తులు పిత్తుచు
బడిబడి బహుభంగి మీఁఱఁ బాఱుచు మరి తా
నొడ లెఱుఁగక పెనుమూర్ఛం
గడు సోలఁగఁ దల్లి కాంచి కటకటపడుచున్. ‖ 77 ‖

ఉ. వేంకటసోమయాజి కిది వేగ మెఱుంగగఁ జెప్పకుండినన్
గింక వహించి దుఃఖపడుఁ గేవల మాతఁడె దీనిఁ గన్నవాఁ
డిం కిట నుండ నేల యని యేడ్చుచు నాతనిఁ జేరి యంతయున్
జంకక చెప్ప నాతఁడును సంభ్రమదుఃఖభయార్ద్రచిత్తుఁ డై. ‖ 78 ‖

తే. వెఱ్ఱిలంజెవు, కా కున్న విషమబుద్ధి
శిశిరకృత్యంబు లీ రీతిఁ జేతు వటఁవె?
చల్లయును నన్నమును బెట్టి నల్లమందు
లోని కిప్పించి చేయింపు తాన మిపుడె. ॥ 79 ॥

క. ఈ చందంబునఁ జేసిన
నీ చిన్నది బ్రతుకు నిపుడు నిక్కము దానిం
జూచెద ననఁ గ్రతు పూనితి
నీ చోటుం దరలి రాఁగ నిది చెడునుకదా. ॥ 80 ॥

ఉ. చన్నుల జందనం బలఁది జానుల నంటిచిగుళ్ళు గప్పి వా
ల్గన్నులఁ గప్పురంపుఁ గలికం బిడి బాహువులందుఁ బొందుగా
దిన్నని తూండ్లు జుట్టి నునుదేనియ మోవిని జిల్కి వేగమే
చిన్నది తెల్విఁగొందు నిక చిత్తములో వగఁబూన నేటికిన్. ॥ 81 ॥

క. అది లెస్సగ ను న్నంతట
ముదమున నీలాద్రిరాజు మోహంబున నీ
సదనమున కరుగుదెంచును
పదపడి మన కిరువురకును భాగ్యము లిచ్చున్. ॥ 82 ॥

క. వస్తాఁడు నీలభూపతి
తెస్తాఁడు ధనంబు నీ కతిప్రమదముగా
నిస్తాఁడు విరహవేదనఁ
జస్తాఁడా? నమ్ము మదిని సందియ మేలా? ॥ 83 ॥

ఆ. అనుచుఁ దెలియఁజెప్ప నామోదహృదయ యై
సరగ నరిగి యట్లు సలుపఁ జంద్ర
రేఖ రేఁగుఁబువ్వు వైఖరిఁ దెల్విచే
వలపు గులకరింప నలరుచుండె. ॥ 84 ॥

క. నీలాద్రి నృపుండచ్చో
సోలుచు విరహానలార్తి స్రుక్కి వగచుచున్
జాలిం బొందుచు నేడ్చుచు
వాలారుచు నింక నేటి వల పనుకొంచున్. ॥ 85 ॥

సీ. దాని జానగు యోనిలో నటింపని మహో
ద్దండదర్పితకామదండ మేల?
దాని కోమలసుధాధరము గ్రోలని మధు
రసరుచివ్యాలోలరసన యేల?
దాని లంబస్తనతాడనం బబ్బని
వరకవాటోపమవక్ష మేల?
దాని జానుయుగమర్దనము సేయని దీర్ఘ
దర్వీసమానహస్తంబు లేల?
గీ. దాని నిర్భరమధుమదాహీనదేహ
గాఢపరిరంభసంభోగకలన లేని
భూరివిస్తారశాల్మలీభూజతుల్య
పుష్టియుతఘనమద్దేహయష్టి యేల? ॥ 86 ॥

క. దానిని మక్కువఁ దొడపైఁ
బూని కనుంగొనని రాజభోగం బేలా?
యీ నెఱవయ సేలా? యని
మానని చింతాభరమున మఱుఁగుచు మఱియున్. ॥ 87 ॥

ఉ. చందురుకావిపావడయు సైకపుబంగరువ్రాఁతచీరయున్
ముందల కుచ్చుగచ్చు తెలిమొగ్గలకంచెల మించు చేమపూఁ
గుందనపుంగడేలు వగగుల్కెడి క్రొమ్ముడి పట్టుబొందు సొం
పందెడు దాని మేనిసొబ గద్దిర! నామదిఁ గొల్లలాడెడిన్. || 88 ||

వ. అని దురంతచింతాక్రాంతస్వాంతుండై. || 89 ||

సీ. గ్రుడ్లు త్రిప్పును బండ్లు కొఱుకును మూల్గును
నీల్గును మిగులఁ గన్నీరు నించు
నసురుసురను పింగు పిసికికొనును నోరు
మోఁదుకొనున్ "లంజెముండ యిచటి
కేల వచ్చెను? దాని నేల చూచి విరాళి
చెందితి?" ననుకొనుఁ జెడితిఁ బడితి
నెవ్వరిఁ బంపుదు? నే రీతి నది వచ్చు?
నేమి సేయుదు? వైన(దైవ) మిట్లు వెతల.
గీ. పాలుగాఁ జేసె సాటి నృపాలకోటి
లోన నగుఁబాటు లయ్యెఁ గా లూనరాని
విరహపరితాపభరమున వేఁగఁ దరమె?
యంచుఁ బలవించుఁ దలవంచు నార్తిగాంచు. || 90 ||

సీ. తములంబు తినఁడు బోగమువారి నాడింపఁ
డన్నంబు కుడువఁడు సన్నవన్నె
కోకలు కట్టఁడు(గల్లఁడు) కొలువుఁ గూర్చుండఁడు
జలక మాడఁడు గంద మలదు(గంప మలఁచు)కొనఁడు
వేపులతోఁ దాను వేఁటకుఁ బోవఁడు
నడు(ను)పుకత్తెలఁ గూడి నవ్వుకొనఁడు
వేంకటముఖి యజ్ఞవిధిఁ గనుంగొనఁడు భా
గవతుల వేషవైఖరులు గనఁడు.
గీ. కటకటా! చంద్రరేఖావికటకటాక్ష
వీక్షణాక్షీణవాతూలవిజితదేహ
బాలభూరుహుఁ డగుచున్న నీలనృపుఁడు
పరవశత లేచి వనలతాతరులఁ జూచి. || 91 ||

క. కమ్మవిలుకాని తూ పన
నమ్మఖశాలాంగణమున నగపడి చనె నో
యుమ్మెత్తకొమ్మ! నీవా
క్రొమ్మెత్తని మేనిసానికొమ్మం గనవే. || 92 ||

క. వింటివొ లేదో శునకపుఁ
దంటెమువలె బిఱ్ఱబిగిసి తలఁగని వలపుం
గొంటిని గనినది మొదలుగ
తంటెపుమోకా! యి దేమి తబ్బిబ్బో కా? || 93 ||

ఆ. కప్పువిప్పు గలుగు గొప్ప కొప్పులరారు
నప్పొలంతిఁ జొప్పు త్రిప్పుకిప్పు
డొప్పుమీఱ మీరు చెప్పరే గుప్పున
మెప్పు లిత్తు నుప్పితిప్పలార! || 94 ||

క. మీ రింద ఱొకటి యై పొలు
పారం దిట మూనఁ బల్కి యతిరయమున నో
కోరిందడొంకలారా
సారేందుముఖీలలామ జాడ దెలుపరే. || 95 ||

క. మారార్తి నెంత వేఁడిన
మా రాకడఁ దెలియఁజెప్పి మా జాడక యో
జోరీఁగలార మీ రా
నారీరత్నమును దెచ్చి నా కొసఁగరుగా. ‖ 96 ‖

క. చింతలనాటి కులీనుఁడ
చింతాసంతాపచలితచిత్తుఁడ నిను నేఁ
జింతామణిగా నెన్నెదఁ
జింతా! యక్కాంత తెరువు చెప్పుము నాకున్. ‖ 97 ‖

సీ. వ్రణకిణాంకితయోనిగణికాలలామ నా
లోకింపరే తుమ్మమ్రాకులార
తుంబీఫలసమానలంబమానోరోజఁ
బొడగానరేఁ బట్టకడుములార
యింగాళకంబళశృంగారతరకేశ
పాశ నీక్షింపరే పాశలార
క్రకచదంష్ట్రాంకురాగ్రమృదుత్వసంయుక్త
దేహఁ గానరె తిప్పతీఁగలార.
గీ. ఉష్ట్రరదనచ్ఛదోపమానోష్టబింబ
నీడఁ జూడరె మీరు జిల్లేడులార
మర్దళసమానవిపరీతమధ్యచంద్రిఁ
గాంచరే నిక్కముగ నేఁడుగారలార. ‖ 98 ‖

ఉ. పోడులమ్రోడులార కడుఁ బూచిన పీతిరితుమ్మలార బల్
బాడిదచెట్టులార ఫలభాగ్విషముష్టికుజంబులార యా
వేడుకకత్తె చిత్తమున వేడుక మీఱఁగ వేగిరంబు మీ
నీడకు నీడ కొక్కసరణిం బఱతెంచదుగా వచింపరే. ‖ 99 ‖

క. బెండా మూర్కొండా యా
దొండా మీ యండ కిపుడు తోరముమీఱన్
దాండవ మాడుచు మేలిప
సిం డందెలచంద్రి రాదె చెచ్చెరఁ జెపుఁడా. ‖ 100 ‖

క. నా కెదలోపల విరహము
చీకాగుగఁ జేయఁజొచ్చెఁ జెచ్చెర నిపు డో
కాకీ ఘూకీ కేకీ
పూ కీదగుమేనిసాని పొడఁ జూపరుగా. ‖ 101 ‖

క. కృకవాకులార మాద్య
త్కృకలాపములార గవయ కిశశశశునీ
వృకజాతులార బోగపు
సకియలతలమిన్నఁ జంద్రిసానిం గనరే. ‖ 102 ‖

క. ఉరుతాపకరణకారణ
వరతామరసాశుగములు వైచి మరుఁడు వి
స్ఫురితాంగిఁ జూపు మిపు డో
యుఱుతా మామాట సేయ నొప్పినఁ గొఱఁతా. ‖ 103 ‖

క. పందీ నీ గాత్రసదృ
క్సౌందర్యకళావిలాసచంచన్మరజి
న్స్పందనమందిర యగు నా
యిందీవరపత్రనేత్రి నిటు చూపఁగదే. ‖ 104 ‖

క. నీ తీరు గలుగు రూపము
చేతన్ విటకోటి నవయఁజేయుచుఁ గడఁకన్
బాతర లాడెడి పడుపుం
గోతిని వీక్షించినావె కోతీ ప్రీతిన్. ‖ 105 ‖

క. కల్లు కడుఁ ద్రావి ప్రేలుచు
హల్లీసక మాడుకొనుచు నది యిచ్చటి కు
ద్యల్లీల రాదె బల్లీ
పిల్లీ కడు ముద్దుఁజిలుకు పిల్లలతల్లీ. ‖ 106 ‖

క. నీలాద్రిరాజనాముఁడ
వాలెంబున దానిఁ జూచి వలచితి నేఁడా
స్థూలోపస్థాన్వితగణి
కాలలనన్ చంద్రరేఖఁ గంటివె ఖరమా. ‖ 107 ‖

వ. అని మఱియును. ‖ 108 ‖

చ. మనసిజమాయలం దగిలి మ్రాఁకులఁ దుష్టలఁ బక్షిజాతులన్
వనమృగకోటులం దలఁచి వారక యీగతి వేఁడి వేఁడినీ
రు నయనపాళి జాలుకొన రోదన మెంతయుఁ జేసికొంచుఁ బూ
చిన విషముష్టిభూరుహము చెంగట నీలశిలాతలంబునన్. ‖ 109 ‖

క. చేరి కళేబర మచ్చో
చేరిచి హా చంద్రి నాకుఁ జెప్పక పఱవం
గారణ మేమి మఱెవ్వని
కోరిక దీర్పంగఁ దలఁచుకొంటివొ చెపుమా. ‖ 110 ‖

క. కోకలు రూకలు నాకులు
పోఁకలు మేఁకలును బట్టుబొందులు సొమ్ముల్
నాకంటె మిక్కి లీగల
రాకొమరుఁడు గలఁడె యీ ధరావలయమునన్. ‖ 111 ‖

క. చక్కనివాఁడ రభసమున
కుక్కుటమార్జాలశునకకూర్మరతులచే
చొక్కింపంగలవాఁడను
జిక్కులు వెట్టంగ నీకుఁ జెల్లునె చంద్రీ. ‖ 112 ‖

క. రమ్మా నా యభిమత మిపు
డిమ్మా యిమ్మాడ్కి నేఁచ నేటికి హొన్నుల్
గొమ్మా సమ్మతి ని(నె)చ్చెదఁ
గొమ్మా వెలముద్దుగుమ్మ గుబ్బలగుమ్మా. ‖ 113 ‖

ఉ. జాలము చేసి మారశరజాలము పాలుగఁ జేయ నాయమా
తాళఁగఁజాల నీ విరహతాపభరంబు కరంబు హెచ్చె నీ
తాళఫలోపమానసముదగ్రకుచద్వయ మక్కుఁజేర్చి లీ
లాలలితోపగూహనకళాకలనన్ సుఖియింపఁజేయుమా. ‖ 114 ‖

శా. శోషించెన్ మదనోపతాపమున నక్షుద్రోన్నతస్థూలని
ర్దోషోద్వృత్తనుయష్టి పుష్టిగను మందుల్ చేసినన్ గా దహో
రోషం బూనక నేఁ డపారకరుణారూఢాత్మపంకేజ వై
యోషిద్రత్నమ చంద్రి నీ యధరపీయూషంబు నా కీయవే. ‖ 115 ‖

క. పెక్కుతెరంగుల నీకున్
మ్రొక్కెదఁ జల మేల నాదుమోహము తీరన్

జక్కెరవిల్తుని కూఁటమి
మిక్కుటముగ తేల్చి యేలు మీ దాసునిగాన్. ‖ 116 ‖

క. మే లెంచెద సామ్రాజ్యం
బేలించెదఁ దొంటిసతుల యెల్లరకంటెన్
లాలించెదఁ బాలించెదఁ
దేలింపుము రతుల నన్నుఁ దేకువ మీఱన్. ‖ 117 ‖

క. చక్కెరవిల్తుని బారిన్
జిక్కితి నీ పాదయుగకుశేశయములకున్
మ్రొక్కితి దక్కితి నిఁక నీ
తక్కులు దిగఁద్రొక్కి నన్ను దయఁ జూడఁగదే. ‖ 118 ‖

తే. గంధమత్తరుజవ్వాదికస్తురియును
దొడ్డయొడ్డాణమును గమ్మదోయి క్రొత్త
పట్టుచీరలు కుచ్చుల బావిలీలు
రొక్క మిదె(వె) గొమ్ము నీ లంజెటక్కు మాని. ‖ 119 ‖

తే. తాళఁజాలను నీ వింత జాల మేల
చేసెదవు నన్ను మిక్కిలి చెలిమి రతుల
నేలు మీ వేగ మా టాడి ఫాలలసిత
సరసనవచంద్రరేఖ యో చంద్రరేఖ. ‖ 120 ‖

ఉ. తియ్యని మొద్దుమాటలును దేనియ గాఱెడు బొల్లిమోవియున్
బయ్యెదకొంగులోఁ బొదలు బల్చనుగుబ్బలు మంగలంబుతోఁ
గయ్యముసేయు మోము నులిగన్నులు తోరపుఁగౌను నాకుఁ జూ
పియ్యెడ మారుకేళిఁ గడు నేలుము జాలము సేయ కింతయున్. ‖ 121 ‖

మ. అమలం బై తరుణారుణద్యుతిసమేతాశ్వత్థపత్రాభ మై
రమణీయస్ఫుటదీర్ఘలింగయుత మై రంగద్ధ్రవోపేత మై
సమ మై రోమవిహీన మై వెడద యై జానొప్పు నీ మారగే
హము నా కర్మిలిఁ జూపి ప్రౌఢరతి నోల్లాడించు చంద్రీ దయన్. ‖ 122 ‖

వ. అని మఱియును. ‖ 123 ‖

ఉ. హా యనుఁ జంచరీకనిచయాంచితకుంచితరోమకామగే
హా యను దానమానితమహాద్విపమోహనమోహనైకబా
హా యనుఁ గంకకాకమహిషాశితదుర్భరనిర్భరాతిదే
హా యనుఁ జంద్రి తాళ నహహా యనుఁ భీతశిరోరుహా యనున్. ‖ 124 ‖

ఉ. డాయఁగ రాకు నన్ను మరుడా యను నేఁచగ నేల రిక్కఱేఁ
డా యను వద్దువద్దు చనుడా యను సోఁకక పొమ్ము గాలిపీ
డా యను చంద్రితల్లి వఱడా యను వేంకటశాస్త్రి నేఁడు రాఁ
డా యను కూఁతుఁ గూర్పఁ దగఁడా యను నేగతి దేవుఁడా యనున్. ‖ 125 ‖

క. ఆకరణి నుడివి డేరా
మేకువలెన్ బిఱ్ఱబిగిసి మిట్టిపడు నిజా
స్తోకసుమకామదండముఁ
జేకొని చీకుచును బుద్ధిఁ జెప్పఁ దొడంగెన్. ‖ 126 ‖

ఉ. చాపలమోపు చంద్రి నిను జక్కఁగఁ జక్కెరవింటిదంట పెన్
గాపురపింటిలోపలికిఁ గ్రక్కున దూరి సుఖింపకుండ సం
తాప మొనర్చి యేఁగె నటు తాళు మటన్నను దాళకేల యు
ద్యాపనశక్తిఁ జూపెదవు దండము నీకు మనోజదండమా. ‖ 127 ‖

ఉ. గచ్చులు మచ్చు లచ్చెరువుగా గడలన్ వెదఁజల్లు చంద్రి బల్
పచ్చనిఱెక్కదోయి గల పక్కిహుమాయివజీరునింటిలోఁ
జొచ్చుచు వచ్చుచున్ మిగులఁ జొక్కుచుఁ గ్రీడ యొనర్చుచుండగాఁ
నిచ్చలు దృష్టి జేసెదను నిల్వవె కొంచెమునేపు దండమా. ॥ 128 ॥

ఉ. పెక్కుతెఱంగులం గరనిపీడన మే నొనరించి వంచినన్
స్రుక్కక మిట్టిమిట్టి తలఁ జూపుచు సన్ననిపంచెఁ జించుచున్
మొక్కలపాటుఁ జూపెదవు మున్నుఁ ద్రికోణము లెన్ని చూపితిన్
మ్రొక్కెద నిక్కు మాను మతిమూర్ఖమనోభవదీర్ఘదండమా. ॥ 129 ॥

ఉ. కాయలు గాచె నీదు తలకాయ యహో సుకుమారవారక
న్యాయతకచ్ఛపోపమభగాంతరనిత్యగతాగతక్రమో
ఛ్రే(ద్రే)యసమగ్రఘట్టనవిశేషతరావద నైన నింక నో
కాయజదండమా విసువుఁ గైకొని యూరక నుండలేవుగా. ॥ 130 ॥

ఉ. పంకము లంటె నాకు బహుభంగుల నీ కతన న్విలాసవ
త్పంకజపత్రనేత్రలను బల్మినిఁ బట్టఁగఁ దద్విశాలమీ
నాంకగృహాంతరాళభరితాత్మజలప్లుతపాంశుసమ్మిళ
త్పంకము నీకు నంటెఁ గద పాపపుమేఢ్రమ యిట్లు సేతురే. ॥ 131 ॥

ఉ. ఎందఱి వేఁడుకొంటి మఱి యెందఱి పాదము లంటుకొంటి ముం
దెందఱి నాశ్రయించితి నిఁ గెందఱికిన్ బ్రణమిల్లఁ జేసెదో
కొందల మందెడి న్మనసు గొబ్బున నా మన వాలకించి యా
బందెలమారి చంద్రి భగభాగ్యము గోరకు మారదండమా. ॥ 132 ॥

సీ. కమలపత్రస్ఫూర్తిఁ గనుపట్టు భగములు
మించుటద్దమ్ముల మించు భగము
లశ్వత్థపాండుదళాకారభగములు
పనసతొనలఁ బోలు ఘనభగములు
దింటెనపూవులవంటి భగంబులు
నీతగింజలరీతి నెసఁగు భగము
లలపందిముట్టెలవలె నుండు భగములు
కాకిపిల్లలనోళ్ళగతి భగములు.
గీ. పెక్కు జూపితి నీవును నిక్కుకొనుచు
నన్ని లొడవెట్టి వెడలితి వకట యిపుడు
చంద్రిభగ మేమి భాగ్యమా సైపుమా ము
డుంగులింగమా చాలపొడుంగు మాని. ॥ 133 ॥

క. తులువలు వడివడిఁ దాకఁగ
లలిఁ జినిఁగిన పూకు దెంగులకు వెఱచునె నీ
తల బ్రద్ద లగును దానిం
దలఁచి నిగుడఁబోకు మదనదండమ యింకన్. ॥ 134 ॥

సీ. కొం కేది బానిసగుడిసెలు దూఱుట
పరికించి చూడ నీకొఱకుఁ గాదె
బత్తిని దొమ్మరితొత్తుల నిల్పుట
గొనకొనియున్న నీకొఱకుఁ గాదె
గోడిగలను గొని గూడులఁ గట్టుట
కొంచ కెంచంగ నీకొఱకుఁ గాదె
బాలవిధవలకు నోలి మాన్యము లిచ్చు
టరసి చూడంగ నీకొఱకుఁ గాదె.
గీ. వారకన్యకలకు నే నవారితముగఁ

గోకలును రూక లిడుట నీకొఱకుఁ గాదె
కూళతన మూను టెల్ల నీకొఱకుఁ గాదె
యో మకారోత్వమా శాంత మూనుకొనుమ. ॥ 135 ॥

ఉ. తేనియకంపు పెంపు గల తేజము ఝల్లునఁ బెల్లువారగా
గోనెలలీలఁ దేరు చనుగొండలు సిండయుఁ దాండవింపఁగా
గానుఁగఱోలు బోలు మెయి కంపిలఁ బైకొని మేఢ్రదండమా
దాని పకారకొమ్ము వెడ దాఁకఁగ వ్రక్కలు సేయు టెన్నడో. ॥ 136 ॥

ఉ. కుక్కుటచూళికాభగనగొల్లి నఖంబుల గిల్లి మెల్లనే
చొక్కపు మన్మథాలయము జుంబన మెంతయుఁ జేసి దానిలో
గ్రక్కున మోవి దూర్చి వగ గైకొని పీల్చినఁ జంద్రి మిక్కిలిం
జొక్కి రమింప నిచ్చుఁగద సొంపుగ నో లవడా తడాలునన్. ॥ 137 ॥

శా. ఆ భూతాకృతి చంద్రి సాంద్రతరరోమాంచత్రికోణంబులో
ఆభోగస్ఫుటచండతాండవమహావ్యాపారకేళీకలా
లాభం బందెద నంచు నిక్కినను నేలా సారె గారించెదో
శేభస్తంభమ దాని పొం దెటువలెన్ సిద్ధించు నీ కిత్తఱిన్. ॥ 138 ॥

ఉ. గొల్లెనకంభ మంత నిడుగొల్లి చొకారపు నల్లతీగెల
ట్లల్లికఁగొన్న రోమములు నద్రిగుహోపమ మౌ బిలంబునన్
దెల్లని కొల్లగంజి పస మించు ద్రవంబును గల్గు చంద్రి మా
రి ల్లెపు డీవు సొచ్చెదవొ హెచ్చరికన్ బహుదీర్ఘశిశ్నమా. ॥ 139 ॥

ఉ. నీచత కోర్చి బంధుజననిందకు రోయకఁ దొల్లి గార్దభిన్
జూచియు నీవు మిట్టిపడఁజొచ్చిన నీ చపలంబుఁ దీర్పఁగా
లోచితవృత్తిఁ గైకొనియు నొద్దిక మీఱఁగ దాని యోని దూ
రించినవాఁడఁ గాదె నిను రిత్తగఁ జేయక నాదు మేఢ్రమా. ॥ 140 ॥

చ. వినువిను వద్దువద్దు యవివేకముఁ బూనకు చంద్రిపూకుపై
మన సిడ కంచుఁ జెప్పినను మానక మిట్టిపడేవు జొచ్చినన్
ఘన మగు పుండ్లునున్ సెగయు గడ్డలు నంటి చెడేవు మానుమీ
యనుపమరూపనిర్జితమహోగజదండమ మారదండమా. ॥ 141 ॥

వ. ఇ ట్లనేకప్రకారంబుల మనోవికారంబుచేతం జేతనాచేతన
జ్ఞానవిహీనుం డై యా నీలాద్రిరాజన్యశతమన్యుం డుద్దండంబుగ దండ
నుండి గండుకొని వచ్చు కుసుమాయుధవిధుమలయాచలసమాగత
వాతపోతమధువ్రతపరభృతకీరశారికావారంబుల గుఱించి దూషింపం
దొడంగె. ॥ 142 ॥

క. మదనా మదనాశుగచయ
మదనా చెలరేఁగి యేయ నాతతశశభృ
ద్వదనామృదులోపస్థా
సదనా యెద నాటె నీపుడు శంబరమథనా. ॥ 143 ॥

తే. సకలపూరుషహృదయార్తి సంఘటించు
సాని నీ చంద్రరేఖాభిధాన మూని
కేరుచున్నది దానిపైఁ గినుక మాని
తద్విరహి నన్ను నేఁచంగఁదగునె చంద్ర. ॥ 144 ॥

క. ఫణిరోమరేఖ యగు న
గ్గణికాంగనమీఁదఁ బోవగా వెఱచి సమీ

రణమా మము నేఁచఁగఁ గా
రణ మేమి తలంగు సత్త్వరత సద్బుద్ధిన్. ‖ 145 ‖

ఉ. మిమ్ము జయించు మించుగల మేలి నునుం బెనుగొప్పుచేతనే
మమ్ము మనోభవప్రకటమార్గణజాలముపాలు చేసి తాఁ
గి మ్మన కేగె దానిదరిఁ గేరరు చంపకగంధి యంచునో
తుమ్మెదలార మీ రిచట దృళ్ళెద రక్కట శౌర్యహీనులై. ‖ 146 ‖

క. ఆ వెలపొలంతిఁ గని నేఁ
గేవలవిరహార్తిచేతఁ గృశియించెడిచో
నీవు చెవుల్ చిందఱగొనఁ
గోవెల కూయకుము నిన్నుఁ గొఱుతన్ వేయన్. ‖ 147 ‖

క. పరపురుషార్థం బంతయు
హరియించును నేఁచు చంద్రి యంచితబింబా
ధర మాని సుఖింపక త
త్పరవశు నను నేఁచ నేమి ఫల మగుఁ జిలుకా. ‖ 148 ‖

తే. అని అనివార్యమానమదనాపదచే సకలప్రపంచమున్
దనువును బేరునున్ మఱచి తన్మహనీయవియోగవార్ధిలో
మునుఁగుచుఁ దేలుచున్ బరమమూర్ఛతచేఁ బలవించుకొంచు అ
జ్జనవరపుంగవుండు కడుసత్త్వము పెంపు దొఱంగి మూర్ఛిలెన్. ‖ 149 ‖

తే. అనుచు శ్రీ నంబి నారసింహార్యవర్యుఁ
డాన తిచ్చిన శివభూసురాగ్రగణ్యు
డైన వీరన విని యద్భుతాత్ముఁ డగుచు
బిదప కథఁ జెప్పుఁ డతులితప్రీతి ననుడు. ‖ 150 ‖

క. మారాకారా కారా
గారాంతరవిహరణోగ్రకర్మఠ పారా
వారావృతధరణీతల
వారవధూజాల నిత్యవర్ణితశీలా. ‖ 151 ‖

మాలిని. హరిగుణగణఖేలా యంగజవ్యాధిలోలా
పరిచితవిటజాలా బాలరండానుకూలా
నిరతరచితజాలా నీచదాసేయపాలా
దురితచయవిశాలా దుర్గుణౌఘాలవాలా. ‖ 152 ‖

గద్యము

ఇది శ్రీమజ్జగన్నాథదేవకరుణాకటాక్షవీక్షణానుక్షణసంలబ్ధసరసకవితా
విచిత్ర సలలితాపస్తంబసూత్ర కౌండిన్యసగోత్ర కూచిమంచికుల
పవిత్ర గంగనామాత్యపుత్త్ర మానితానూనసమాననానా
విధరనంగత్రిలింగదేశభాషావిశేషభూషితాశేషకవితావిలా
సభాసురాఖర్వసర్వలక్షణసారసంగ్రహోద్దామ శుద్ధాం
ధ్రరామాయణప్రముఖబహుళప్రబంధనిబంధన
బంధురవిధాన నవీనశబ్దశాసనబిరుదాభిరామ
తిమ్మకవిసార్వభౌమసహోదర గురుయశో
మేదుర వివిధవిద్వజ్జనవిధేయ జగన్నాథ
నామధేయ ప్రణీతంబైన చంద్రరేఖా
విలాపం బను హాస్యరసప్రబంధ
రాజంబునం ద్వితీయా

శ్రీరస్తు

# చంద్రరేఖావిలాపము

## తృతీయాశ్వాసము



రతిసతీమనోహర
చారుతరగృహాయమానశష్పావృతవి
స్తారభగాన్వితచంద్రీ
నీరంధ్రాశేవ్యలోల నీలనృపాలా. ‖ 1 ‖

వ. ఆకర్ణింపుము తావకీనకథావిధానంబు యథార్థంబుగా
శ్రీశివబ్రాహ్మణవర్ణాగ్రగణ్యుం డైన వీరభద్రభట్టారకేంద్రు
నకు శ్రీమద్వైఖానసవంశోత్తంసం బగు నరసింహాచార్యవర్యుం డవ్వలి
కథ యిట్లని చెప్పం దొడంగె. ‖ 2 ‖

క. అంతటఁ బటఘటితగృహా
భ్యంతరమహిషానుపుష్పబంధురబలవ
ద్దంతయుతశయ్య నమ్మహి
కాంతుఁడు లే కున్న దాసి కలు డాసి కడున్. ‖ 3 ‖

క. కళవళ మందుచు మన మిటఁ
గొలగొల మనుకొంచుఁ జుట్టుకొని యుండఁగఁ గో
మలగతి నేడకుఁ జనెనో
తెలియ దహా దైవమాయ తీ రెట్లగునో. ‖ 4 ‖

సీ. పిక్క లూరులు కాళ్ళు పిల్లసేవకులచే
గ్రుద్దించుకొనుచుండెఁ గొంతసేపు
పాటకు ల్పఱతేరఁ బాడించుకొంచును
గొల్వుదీరిచియుండెఁ గొంతసేపు
హితవు మీఱఁగ భాగవతుల మేల్వేసాల
వింత గన్గొనుచుండెఁ గొంతసేపు
మద్దెలమ్రోయంగ గుద్దఁ ద్రిప్పుచు నాడు
నింతిఁ గన్గొనుచుండెఁ గొంతసేపు.
గీ. మంచ మెక్కి యొక్కతెతోడ మదనకదన
మెంతయును జేయుచుండెను గొంతసేపు
తమలము మెసంగి పొగచుట్ట త్రాగిఁ గొంత
సే పతం డంత నెం దేఁగెఁ జెప్ప రమ్మ. ‖ 5 ‖

క. ఏ లంజె యింటి కేఁగెనొ
యే లీలావతిని బలిమి నెనయించెనొ తా
నేలాగు మాయ మయ్యెను
నీలాద్రినృపుండు కామినీలోలుఁ డహా. ‖ 6 ‖

క. వేంకటశాస్త్రులయజ్ఞము
పొంకము చూడంగ లేచిపోయెనొ లే దా
వంకఁ బులి మ్రింగిపోయెనొ
జం కయ్యెడిఁ జెప్ప రమ్మ జవ్వనులారా. ‖ 7 ‖

సి. ఇందుఁ దా వెల్వడి యెందు వేంచేసెనో
మా సామిఁ జూపరే ప్రాకులార
సన్నకసన్న నే సకిఁ గూడియుండెనో
మా ఱేనిఁ జూపరే మద్దులార
వేఁపులఁ బట్టుక వేఁటకుఁ బోయెనో
మా దొరఁ జూపరే మడుఁగులార
యిందఱ భ్రమియించి యేటికిఁ బోయెనో
మా రాజుఁ జూపరే జారులార.
గీ. మమ్ము నేలిన నీలాద్రిమనుజవిభుఁడు
పూలపాన్పునఁ బెనునిద్ర పోయిపోయి
లేచి యొక్కరుఁడును మా కగోచరముగ
నెచ్చట నడంగెఁ జెప్పరే పచ్చులార. ‖ 8 ‖

క. ఎల్లీ మల్లీ వల్లీ
పుల్లీ మా రాజు కూసుపోవక మీమీ
గొల్లెనకై రాఁడు గదా
కల్లలు వల దింకఁ జెప్పగదరే వేగన్. ‖ 9 ‖

సుగంధి. నేలఱేఁడులార మంచినేస్తులార విక్రమా
భీలశూరులార పిన్నపెద్దలార గుప్పునన్
బూలపాన్పు డిగ్గి యేడఁ బోయినాఁడొ చూడరే
నీలకాశ్యపీవరుండు నిన్నరేయి యొక్కఁడున్. ‖ 10 ‖

మ. అని గగ్గోలుగ వారు రోదనము సేయన్ నాయకుల్ గాయకుల్
చనవర్లున్ గణికాజనంబు లనుజుల్ సామంతులున్ మంత్రులున్
విని శోకాకులచిత్తు లై కదిసి తద్వృత్తాంత మాలించి యా
యన నన్వేషము సేయఁబోయిరి సమీపారణ్యమధ్యంబునన్. ‖ 11 ‖

క. గట్టుల దరిఁ బుట్టల కడఁ
జెట్టుల చెంగటను జెఱువు చెంతల బలు పె
న్గుట్టల సందుల గొందులఁ
బట్టుగఁ బ్రవహించు నేటిపల్లములందున్. ‖ 12 ‖

క. రోయుచు హో యని కూఁకలు
వేయుచు హా నీలభూప విస్మయముగ నీ
వేయెడ కేఁగితొ వెస రా
వే యనుచును మోఁదుకొనుచు వివ్వాలు లగుచున్. ‖ 13 ‖

క. మూఁగి యరయంగ నాతని
తోఁ గూడం జనిన వేఁటతోరపుఁగుక్కల్
సైగలు సేయుచు సాగఁగ
నా గతి గని చనిరి వార లందఱు వెంటన్. ‖ 14 ‖

క. చని కనిరి చంద్రరేఖా
తనురూపవిలాసవహ్నిదగ్ధశరీరున్
ఘనచింతాభారున్ నూ
తనజనితదశావికారు తన్నృపమారున్. ‖ 15 ‖

వ. ఇట్లు కనుంగొని సకలపరివారంబు లతనిం జుట్టుకొని
యాక్రందనంబు సేయుచు నాశ్చర్యధుర్యమానసంబుతో ని ట్లనిరి. ‖ 16 ‖

క. వాతము పట్టెనొ వనిఁ బెను
భూతము గొట్టెనొ మఱెట్టి పొడగుట్టెనొ? హా

హా తెలియ దేమి మాయయొ
యాతఁడు పడియున్న చంద మెంచి కనంగన్. ‖ 17 ‖

సీ. బహుళద్విజద్రవ్యభక్షణోద్భవమహా
పాతకంబున నోరు పడియె నొక్కొ?
కవిమాన్యహరణదుష్కర్మప్రభూతాతి
కలుషంబుచే జిహ్వ పలుకదొక్కొ?
పరసతీవ్రతభంగకరణప్రభవపంక
గతి దుర్బలాంగంబు గదలదొక్కొ?
సుజనులఁ జెడఁజూచు చూడ్కిఁ జుట్టిన కొలఁ
గడుఁ గనుంగవ మూఁతవడియె నొక్కొ?
గీ. నిరతనిజదాసికాజననికరములను
బలిమిమైఁ బట్టిపగ లింట బట్టి మిగుల
సమరతులఁ దేలఁ బొడము దోసమున నొక్కొ?
నీలనరనాథుఁ డిట్లొంటిఁ గూలినాడు. ‖ 18 ‖

వ. అని మహాదుఃఖావేశంబున నందఱు నిట్లనిరి. ‖ 19 ‖

సీ. కొలువు దీర్పవ దేమి గురుతరతరుసార
భాసురలక్ష్మీవిలాసముననను?
కూర్చుండవది యేమి ఘుమఘుమామోదగుం
భితసుచందనకాష్ఠపీఠముననను?
తేఱి చూడవ దేమి దృఢతరలావణ్య
గణ్యపణ్యస్త్రీనికాయములను?
పలుకరింపవ దేమి బహువేషభాషాతి
బంధురాశ్రితబాలభాగవతుల?
గీ. నకట నీలాద్రిరాజభోగానురక్తి
మాని ఈ ఘోరకాంతారమహిని బండఁ
గారణం బేమి యేరిపైఁ గాఁక పూని
తెగి యిటకు వచ్చి యిట్లు నిద్రించె దిపుడు. ‖ 20 ‖

క. కేళీభవనాంతరపరి
కీలితమల్లీలతాంతకేవలశయ్యా
లోలుఁడ వై యుండక యీ
నేలపయిం బండ నేల నీలనృపాలా. ‖ 21 ‖

సీ. విజయరామక్షమావిభుఁడు పిల్వఁగఁ బంచె
రాచిరాజకుమార లేచిరమ్ము
యెఱుకువాఁ డిదె పంది నేసి మాంసము దెచ్చి
కాచుకయున్నాఁడు లేచిరమ్ము
వేఁటకుక్కలఁ గాన్క వెట్టి పంపిరి దొరల్
చూచివత్తువుగాని లేచిరమ్ము
కొత్తపారావారు కొలువంగ వచ్చిరి
రాచయేనుఁగుగున్న లేచిరమ్ము.
గీ. దాసి యొక్కతె నీ పొందు కాస చెంది
వాఁచియున్నది విషయింప లేచిరమ్ము
సలుపుఁ గొల్పెడి పుండ్ల బూచులకు మందు
రాచికొన నీలనృప వేగ లేచిరమ్ము. ‖ 22 ‖

వ. అని మఱియును.

క. కదలఁడు పలుకఁడు ధాతువు
పదకరముల నుండఁ జూచి బ్రతుకునొ లేదో
బెదరకఁ జెప్పు మ దెట్లు
న్నదొ యీతని కో ముడుంబి నరసాచార్యా. ‖ 23 ‖

తే. అనిన నాతండు దగ్గఱ కరిగి ధాతు
గతి పరీక్షించి యితనికిఁ గామరోగ
మంకురించిన దిఁక మీరు జంకు మాని
సరగ శిశిరోపచారముల్ సలుప లేచు. ‖ 24 ‖

క. అని చెప్పిన వా రందఱు
జనితామోదంబుతోడఁ జల్లనిపను లే
పునఁ జేయఁగ సమకట్టిరి
మనుజాధిపుచెంతఁ జేరి మక్కువ మీఱన్. ‖ 25 ‖

క. పసుపును నూనెయుఁ గరపద
బిసరుహముల రాచి విసముఁ బిండి శిరమునం
దిసు మంత గొఱిగి వడి నిడి
వెసఁ జెవి వెల్లుల్లి యూఁద వేగమె తెలిసెన్. ‖ 26 ‖

ఆ. తెలిసి యుస్సు రనుచు నలుదిక్కులను జూచి
సైగ సేయ వారు చల్లగంజి
వంటకంబుఁ బిసికి పడిఁబోయ మెల్లన
గుటుకుగుటుకు రనుచుఁ గ్రోలి సోలి. ‖ 27 ‖

క. తెప్పిఱి కూర్చుండి యతం
డప్పుడు తన చంద మెల్ల నాప్తులతోడన్
గుప్పున నేకాంతంబునఁ
జెప్పిన విని లంజె యెంత చేసెనఁ టంచున్. ‖ 28 ‖

క. బొకనాసి, గడ్డ, సెగయును
నకటా యీ నీలవిభుని కంటించిన యిం
టికి నొంటికి హాని గదా
ప్రకటంబుగఁ బురుగు లురలిపడి చచ్చుఁ గదా. ‖ 29 ‖

క. పట్టుఁడు కట్టుఁడు కొట్టుఁడు
"గట్టిగఁ దల బోడిచేసి గాడిదమీఁదన్
పెట్టుఁడు పురి వెడలంగా
గొట్టుఁ" డనిరి యంద ఱొకటఁ గోపము మీఱన్. ‖ 30 ‖

వ. అప్పుడు నీలాద్రిభూమిపుండు. ‖ 31 ‖

ఆ. దానిఁ బట్టఁ బూను తఱిబీఁజుఁ గనుఁగొని
సాని నిట్లు సేయఁ జనదు నాకుఁ
గూర్మిమీఱ మీరు కుస్తరిం చిటు తోడి
తెచ్చి కూర్పవలయు నిశ్చయముగ. ‖ 32 ‖

క. తల గొఱిగించుట కంటెన్
మొల గొఱిగించుటయె మేలు ముగ్ధ యగుట బల్
సలుపున కోర్వక యుంచిన
దిల విటులకు నింత భాగ్య మేదీ జగతిన్. ‖ 33 ‖

క. సమ మై రోమరహిత మై
యమితమృదుత్వంబుఁ గలిగి యశ్వత్థదళో

పమ మై స్నిగ్ధం బై వెళు
పమరెడు భగ మిచ్చు భాగ్య మందురు శాస్త్రుల్. ‖ 34 ‖

ఆ. ఇన్ని లక్షణంబు లెన్న దాని త్రికోణ
పాళి నుండు ననుచు హాళి నాదు
నంతరాత్మఁ దోచె నయ్యది సౌభాగ్య
వతియె సుమ్ము పెక్కువాక్కు లేల. ‖ 35 ‖

ఆ. దాని యోని తీరు దాని చన్నుల చెన్ను
దాని మోము గోము దాని మోవి
కావి తీవి చెప్పఁగా మాకు శక్యమే
రోమములు వడంకు భీమరాజ. ‖ 36 ‖

క. సిద్ధాంతివి పండితుఁడవు
సద్ధర్ముండవును నాకు సఖుఁడ వెపుడు నే
నుద్ధతి దాని రమించెద
శుద్ధగతిం జెప్పు శొంఠి సుబ్బయ మాకున్. ‖ 37 ‖

వ. అని పలుకునప్పుడు పండితుండును నిష్ఠాగరిష్ఠుండును
సుజ్ఞాననిపుణుండును హితుండును బ్రాహ్మణాగ్రగణ్యుండును శాం
తుండును సకలజనసమ్మతుండును జతురుండును ప్రయాగవంశోత్తఁ
ముండును నగు బాపన్న యాపన్నుండై యా పగిది వాపోవుచుఁ
గన్నులు తేలవైచుచున్న యా నీలాద్రిమన్నుఁటేనిం గనుంగొని
వినయవిసంభ్రగాంభీర్యంబులు గుంభింప గంభీరభాషంబుల మెల్ల
మెల్లన యిట్లనియె. ‖ 38 ‖

క. పరనారీసోదరుఁడవు
పరతత్త్వవిశారదుఁడవు బహురాజసభాం
తరనుతకీర్తివి వేశ్యా
తరుణీమైథునము సేయఁ దలపం దగునే. ‖ 39 ‖

సీ. చెఱవు చేసితివిగా చెలఁగి బాడవక్రింద
సద్రాజు లెన్న సముద్రముగను
వనము నిల్పితివిగా వర్ణింపరాకుండ
వీఁక నరట్ల కుప్పాక నడుమ
మాన్య మిచ్చితివిగా మహిషి మూలంబున
శొంఠిసుబ్బయ్యకు క్షుద్రభూమి
నా కిచ్చితివి గదా నాలుగైదు వరాలు
పేశలగతిని వర్షాశనముగ.
గీ. వివిధసంగ్రామజయరామవిజయరామ
రాజకరుణాకటాక్షనిర్వ్యాజలబ్ధ
సకలసామ్రాజ్యఖనివి నీ వకట యొక్క
పుప్పి బోగపులంజెకై పొగులఁదగునె. ‖ 40 ‖

క. ఇల్లును నొళ్ళును గుల్లగుఁ
బె ల్లడరెడు రాజ్యలక్ష్మి పెంపు హరించున్
గుల్లాపుసానిదానిన్
మళ్ళుతని తమిఁ గోరి నీవు మఱి రతి సలుపన్. ‖ 41 ‖

క. వద్దు సుమీ యిది కూడని
పద్దు సుమీ నాదు మాట పాలించితివా

ముద్దు సుమీ యా సానిది
మొద్దు సుమీ దాని దెంగు మోహం బేలా. ‖ 42 ‖

క. జగ్గకవిరాజు చేతం
బగ్గియు సిరి వోవఁ దిట్లు వడితివి చంద్రిన్
మగ్గము వెట్టిన మొదలే
నగ్గవయో నీలభూప నృపసుమచాపా. ‖ 43 ‖

వ. అప్పు డప్పలుకులు విని కటకటంబడి కటమదరిఁ బండ్లు
పెటపెటం గొటికి చటులక్రోధకుటిలారుణలోచనుం డై తదీయప్రధాన
ప్రధానుం డగు పాదుర్తి భీమనామమంత్రి యతని కిట్లనియె. ‖ 44 ‖

క. ప్రభుచిత్త మెవ్విధంబున
ప్రభవించునొ యట్లె నీవుఁ బలుకక వడి ని
ట్లు భయము మాని పలికెదవు
సభలో వారెల్లఁ గడు నసహ్యత పడగన్. ‖ 45 ‖

క. ఓంభూలు చేసికొంచును
జంభంబులు గొట్టుకొనుచు జడమతి నశుభా
రంభము లరయుచుఁ దిరిగెడి
దంభపువిప్రునకు నీకుఁ దగ దిది చనుమా. ‖ 46 ‖

ఆ. పప్పుదప్పళంబు లొప్పు దప్పొప్పులు
సెప్పుకొంచుఁ దడక విప్పుకొంచుఁ
జదువుకొంచుఁ దిరుగ ఛాందసుల్ మీరలు
రాచకార్యములకు రాఁగఁ దగునె. ‖ 47 ‖

క. వైశ్యం బేలా విధవకు
వైశ్యునకున్ సమరవిజయవాంఛ ల వేలా
వశ్య యయి కులికి పైఁబడు
వేశ్యారతిసుఖము వేదవేద్యున కేలా. ‖ 48 ‖

వ. అనిన నమ్మంత్రిజనపుంగవున కాతం డిట్లనియె. ‖ 49 ‖

క. నిష్ఠహీనుండవు ఘన
నిష్ఠురయాప్రలాపనిపుణుఁడ వీవే
జేష్ఠ వితనిని నియోగి
జ్యేష్ఠులలోపలను జేర్చి చెప్పఁగ నేలా. ‖ 50 ‖

క. తిరుమణియు దులసిపేరులు
తిరువారాధనయు బెద్ద తిరుగూడ వెసన్
ధరియించి ముష్టి కిప్పుడె
తరలుము మంత్రాంగ ముడిగి దాసరి వగుచున్. ‖ 51 ‖

గీ. బంధుఁడును బండితుఁడు గూరపాటి రాయ
మంత్రివర్యుఁ డతని దోలు మడతబెట్టి
కొట్టి సన్యాసి జేసితి విట్టివాఁడ
వితని గులశేఖరుని జేయు టెంత నీకు. ‖ 52 ‖

సీ. ఇయ్యనీయవుగదా యెంత సత్కవి వచ్చి
ప్రస్తుతించిన బూటబత్తె మైన
నుండనీయవుగదా చండపండితరాజ
మండలంబును సభామంటపమున
నిల్వనీయవుగదా నిమిషమాత్రం బైన

నాశీర్వదించు ధరామరులను
చూడనీయవుగదా వేడుకతో బాడు
గానవిద్యాప్రౌఢగాయకులను.
గీ. కూసుమతమార్గరతుఁడ వై(డైన) కులము విడిచి
తిరిగి(తిరుగు) నీ విందు జేరి మంత్రిత్వ మూని
త్రిప్ప నీలాద్రిరా జిట్లు మొప్పె యయ్యె
భీకరవ్యాజ యాదుర్తి భీమరాజ. ॥ 53 ॥

శా. సామం బేమియు లేదు సాంత్వనవచస్సందర్భమున్ నాస్తి దు
ర్గ్రామణ్యం బధికంబు కాముకతయు న్గాపట్యము న్హెచ్చుగా
భీమామాత్యుఁడ వంచు బల్కుదురు ని న్బృధ్వి న్యదార్థం బహో
నీ మంత్రాంగముచేత నేడు చెడియె న్నీలాద్రిరా జెంతయున్. ॥ 54 ॥

క. గణికశ్రేష్ఠుఁడ వయ్యో
గణకాంగన పొందు రాజుగారికి దగదం
చణుమాత్రము చెప్పవు నీ
గుణము తెలిసివచ్చె బుద్ధికుశలుఁడవు భళీ. ॥ 55 ॥

క. అని వా రిరువు నిటువలె
ఘనఘనరవసదృశనాదగద్గదగళు లై
కినుక వివాదింపంగా
విని చింతలపాటి నీలవిభుఁ డి ట్లనియెన్. ॥ 56 ॥

క. మీ రేటికి వాదించెద
రూరక యుండుండు చెలిమి యొప్పారంగా
గౌరవమున నా మది గల
యారాటము తీర్ప బాపఁ డసమర్థుఁడుగా. ॥ 57 ॥

క. రతిచింతచేత నిప్పుడు
మతిపోయిన రీతినుండు మాకు న్బుద్ధుల్
హితమతి చెప్పెదు పోపో
పతిచిత్త మెఱుంగలేవు బాపఁడ వయ్యున్. ॥ 58 ॥

వ. అని యతనిమీద రోషసంఘటితచిత్తుం డగుట గనుం
గొని తత్సన్నిధిగలవార లేగు మనిన నతం డరిగె నంత భీమరాజుం
జూచి యేకాంతంబున నిట్లనియె. ॥ 59 ॥

క. బాపఁ డని నేస్తుఁ డనియును
నోపిక చేసితిని గాని యొడుతును జుమ్మీ
పాపమున కోడ కి మ్మెయి
బాపన్నను భీమరాజ పటుకోపమునన్. ॥ 60 ॥

వ. అనిన భీమరా జతని కిట్లనియె. ॥ 61 ॥

క. అద నైన బంది బొడవవొ
యెదురించిన పులిని బొడవవొ యేన్గు బొడవవో
కదనమున శత్రు బొడవవొ
వదరుచు నెదురాడు నట్టి పారు బొడవవో. ॥ 62 ॥

క. అని భీమరాజు పలికిన
విని మనమున సంతసించి వేడుకతో ని
ట్లనియెను జంద్రిని వేగం
బనుకూలము సేయకున్న హా యె ట్లోర్తున్. ॥ 63 ॥

ఉ. కోకిలకీరశారికలకూకలకు న్గలహంసకేకిని
భీకరనిర్భరార్భటికి బెగ్గిలితి న్మఱి చెప్ప నోప నెం
దాక సహించువాఁడ వెస దానిత్రికోణము దెచ్చిచూపుమా
నా కెదలోని మన్మథకనద్ఘనపావకతాప మాఱఁగన్. ‖ 64 ‖

గీ. మరి విచారింప నది యాడిమళ్ళ వేంక
టాభిధానప్రత్రేజాపతి యంశ బుట్టి
సకలరతిబంధచాతుర్యసరణి గనియె
పూని వర్ణింప దాని కే సాని సవతు? ‖ 65 ‖

క. కావున వేంకటశాస్త్రికి
నా వల పెఱుగంగ జెప్పినను నాతఁడు తా
నావలిపని సమకూర్చును
వేవేగమె భీమరాజ విచ్చేయవయా. ‖ 66 ‖

వ. అని చెప్పి.

చ. పనిచిన నాతఁ డేగి గనె భంజితనీలతరాజకాయసం
జనితకరోటికూటము వసాసఘృత ప్లుతసత్పలాశమాం
సనికరవర్ధమానవిలసత్పటువహ్నిశిఖాప్రభాటమ
త్యనుపమమంత్రతంత్రకరయాజకఝాటము యజ్ఞవాటమున్. ‖ 67 ‖

క. కనుగొని తచ్ఛాలాంతర
మున దక్షుడు బోలె యజ్ఞ ముగ్రంబున దా
నొనరించు వేంకటమఖిన్
జనవున కని రాజకార్యసంగతి దెలిపెన్. ‖ 68 ‖

క. తెలిపిన మఖి యత్యంతము
బులుపు వొడమ భీమమంత్రి పుంగవ వెస దా
దలచిన పని సమకూర్తును
చెలిమి వెలయ నీ మఖంబు చెల్లిన పిదపన్. ‖ 69 ‖

క. దాతయు దైవము నేతయు
నే తీరున గన్న నతఁడె యెప్పుడు గానన్
నీతోడు భీమరాజా
యాతని పని సేయు టుచిత మగుఁ గద మాకున్. ‖ 70 ‖

క. అని రాజుగారి కంతయు
వినయంబునఁ దెలుపుమనుచు వేడిన నతఁడున్
జని యట్ల చెప్ప నీలా
వనివిభుఁడుఁ గుడారముననను వనరుచునుండెన్. ‖ 71 ‖

వ. అనంతరంబున నయ్యారామద్రావిడబాడబాగ్రగణ్యుం
డగు వేంకటసోమపీథినిరతపర్యుషితాన్నదానవిధానసంక్రుద్ధసుప్రసిద్ధ
వృద్ధభూమీసురవారానివారితభూరితరదారుణభాషావిశేషదూషితం
బును ప్రచండతరచండాలసరోవరపరిసరపరికల్పితానల్పవిశాలశాలా
తటతటులకుటిలాచ్ఛమత్స్యపుచ్ఛాచ్ఛాదితకృపీటసంపాద్యమానా
హీనపురోడాశప్రము ఖాయోగ్యవస్తుయాగభాగానురాగారహితవిహిత
మహితబృందారకబృందంబును యథావిధివన్నిర్ధారితదక్షిణాక్షీణ
పదార్థవంచనాగుణనిరస్తోత్సాహసాహసధావన్మహాసోమయాజివిరాజి
తంబును జామాత్యమూర్ఖమహాకఠినవాక్యతర్జనభర్జనపలాయితసకల
దేశసమాగతవివిధవిప్రప్రకరంబును పరమపరిహాసకపరికల్పితస్వచ్ఛ
చ్ఛాగనాదామోదితవేదితలాంతరపరివర్తితధూర్తపండితపామరజనస

మూహంబును బ్రాహ్మణార్థసంపాదితబహుళసత్ఫలశాకపాకభక్ష్య
భోజ్యదధిఘృతగుడాదికవస్తుస్తోమచౌర్యక్రియాకౌశలయాతాయాతా
తతాయిశ్రేష్ఠకుమారనారాయణశాస్త్రివిశ్రుతంబును సంభావనా
సంభ్రమాలోకనార్థసమాగతవితతవారాంగనాభుజంగపుంగవశృంగా
రకేళీగృహాయమానశాలాసమీపప్రదీప్తవిశాలకాయమాననికాయం
బును విపులాపూపశరావోపమానూనపీనోపస్థాస్థలవికీర్ణాస్తోకానేకదీర్ఘ
తరశ్యామలకోమలరోమస్థోమోద్ఘాటనపాటవప్రోల్లసద్భాలవిధవావి
రాజితాంతర్గేహంబును విదార్యమాణపశువిసరకళేబరసంజనితఘన
తరక్షరితక్షతజప్రవాహాబిందుసందోహగ్రసనవ్యసనసంభ్రమభ్రమద
దభ్రశుభ్రగృధ్రకాకఘూకకంకకౌలేయకగనయగోమాయుప్రముఖ
వన్యఖగమృగజాలకోలాహలబధిరీకృతజనసమూహంబును పరమ
నిర్భరనిర్భాగ్యదామోదరదురోదరమృగయావినోదామోదఖేల
న్నీలాద్రినృపాలబాలిశదుష్కరకరాగ్రసమర్పితయాగఫలదానధారా
పూరంబునుంగా క్రతువు సమాప్తంబు గావించి జన్మంబు బన్నంబు
లేకుండ గడతేఱె మదీయపుత్త్రియు నిజముఖకళావిలాసతిర
స్కృతచంద్రరేఖ యగు చంద్రరేఖను కోమలాలంకారభవ్య
యగు నా కావ్యకన్యకకును నుత్తముండగు నీలాద్రినృపుండు
వరుండ య్యెడు సమయంబు నయ్యె మామకీన భాగ్యమహిమంబు
చెప్పదరంబె యని సంతుష్టాంతరంగుండై చని చని. || 72 ||

సీ. పూతిగంధాధారిపుంఖితడిండీర
భరిత మై రేయకుంభవ్రజంబు
గ్రామసూకరమాంసఖండతోరణవార
కంకవాయసగృధ్రసంకులంబు
మేదురఖాదనామోదసంపాదిత
తామ్రచూడాసహ్యాతటతలంబు
రతిరాజసంగరోత్థితషిద్గజనశుక్ల
మూత్రార్థగేహాళీచిత్రితంబు.
గీ. విటవిటీజనసంధాన విహితవచన
నిచయరచనానిపుణకుట్ట నీ సహాయ
కరణకారణకౌలేయకంబు వేంక
టాభిధానాతినీచవేశ్యాలయంబు. || 73 ||

క. ఇటు నటుఁ గనుఁగొని లోనికి
లొటలొటఁ జని మంచ మెక్కి లోలత నది త
త్తటమునఁ గూర్చుండిన న
క్కుటిలాత్ముఁడు కౌఁగలించుకొని యి ట్లనియెన్. || 74 ||

తే. ఎంత భాగ్యంబు చేసితి మిరువురమును
కాసు విడకుండ యజ్ఞంబు కలిగెఁ జంద్ర
రేఖను దలఁచి నీలాద్రిఱేఁడు మిగుల
మోహితుం డయ్యె భాగ్య మామోద మొదవె. || 75 ||

క. నీలాద్రిరాజు మిక్కిలి
తాళక కృశియించె విరహదహనముచే నీ
వేళం జచ్చును వేగం
బాలోలతఁ జంద్రి నంపు మాతని కడకున్. || 76 ||

తే. పూలమ్రాఁకులు నీవు నీపుత్త్రికయును
చూచువల్ల యెఱింగి బొజుగుల వలపు

వెల్లి గొలుపుచు బలువుగ విత్త మెల్ల
లాగుదురు ధాత్రి మీవంటి లంజెలే రి. ‖ 77 ‖

తే. నేడు నీ కల్లుఁ డాయెను నీలనృపుఁడు
కూఁతురును నీవు నేనును గొదవ లేని
సిరులఁ బొదలెద మింక నీ చిన్నదానిఁ
గడఁక గైసేయు మని చంద్రి గాంచి పలికె. ‖ 78 ‖

తే. బాలరో నీవు మిగుల సౌభాగ్యవతివి
యొక బొజుగు వోవ మఱి యొక్క డుత్తముండు
దొరకె నీలాద్రిరాజు సచ్చరితుఁ డిపుడు
నిన్ను గోరి పిలువనంపె నేఁడు నీవు. ‖ 79 ‖

క. ఏలాగున నలయించెదొ
యేలాగున నీలవిభుని వలయించెదొ మ
మ్మేలాగున రక్షించెదొ
బోలెఁ దెగడు నీదు భగము పుణ్యముచేతన్. ‖ 80 ‖

వ. అనిన చంద్రరేఖ యిట్లనియె. ‖ 81 ‖

సీ. చూపుకోపులచేత చుంబనంబులచేత
దంతక్షతనఖక్షతములచేత
తాడనంబులచేత బీడనంబులచేత
గాఢపరీరంభకలనచేత
నుపరతిగతులచే గపటవాక్యములచే
దాంబూలదానవిధంబుచేత
కలవంబుఁబూఁతచేఁ గారవింపులచేత
గాననాట్యప్రసంగములచేత.
గీ. మందుమంత్రంబులను నీలమనుజవరుని
లోలు గావించి కలధనం బోలి లాగి
పిదప జోగిగఁ గావించి మద ముడించి
తెత్తు మీ సన్నిధికి నా ప్రతిజ్ఞ వినుఁడు. ‖ 82 ‖

ఆ. దొడ్డదొడ్డ తురకబిడ్డల నా తొడ
లందు నిరకఁబట్టి యడుగునెత్తిఁ
బెట్టి లోలుఁ జేసి వెట్టివానిగఁ జేతు
నీలనృపుఁడు నాకుఁ జాలగలఁడె. ‖ 83 ‖

తే. అనిన నీవంత నేర్పరి వగుదు వమ్మ
లెమ్మ ముస్తాబు గమ్మ శీఘ్రమ్ముగాను
బొమ్మ యాతనితమిఁ దీర్పఁ గమ్మవిల్తు
చేతి బంగరుబొమ్మ యో చిన్నికొమ్మ. ‖ 84 ‖

క. నావు డల చంద్రి యప్పుడు
భావం బలరార లేచి పరిపరిగతులన్
వేవేగఁ జేయ దొడగెన్
గేవలశృంగార మొడలఁ గీలుకొనంగన్. ‖ 85 ‖

క. నీలాద్రిరాజు మోమున
గ్రాలెడు గడ్డంబురీతిఁ గనుపట్టి మహా
స్థూలోపస్థాభాసా
భీలతనూరుహము లన్ని బిరబిర బెఱికెన్. ‖ 86 ‖

క. ఆతని పెనుబాలిసుల
భాతిన్ గడుపొడవు లగుచుఁ బ్రబలు కుచములం
దాతతమలయాచలసం
జాతసుగంధంబు మిగులఁ జానుగ నలఁదెన్. ‖ 87 ‖

క. భుగభుగ సుగంధబంధుర
మగుచుండెడు ధూప మిడియె నానందమునన్
నిగనిగ లీనెడు తన ఘన
భగదేవత కాత్మవాంఛ ఫలియించుటకున్. ‖ 88 ‖

ఆ. గొట్టెబొచ్చుకంటె నెట్టి నై చిట్టి లౌ
కుట్టివెండ్రుకలను గూడదువ్వి
తొట్టికొప్పు వెట్టె నట్టుమీదను జాల
విట్టువీగుకొంచు బిట్టుబిగియ. ‖ 89 ‖

క. హరిమొగము దెగడు మొగమున
హరిదళమును దళముగాగ నలది మహాసిం
ధురతరనేత్రయుగంబున
గరమరుదారంగ మందు కాటుక వెట్టెన్. ‖ 90 ‖

క. సత్తికి సింగారించిన
యిత్తడిసొమ్ములను బోలి యెసగగ మేనన్
బుత్తడిసొమ్ములు తన కా
పత్తారణకారణముగ బాగుగ దాల్చెన్. ‖ 91 ‖

క. కంచెలలోపల గట్టి బి
గించెన్ జనుకట్టుదోయి గిరినాగుల నా
డించక హితుండికుఁడు వడి
వంచనతో బెట్టినట్టి వైకరి దోపన్. ‖ 92 ‖

క. ఈలీల నలంకృతయై
యాలోల వెలింగి నప్పు డాశ్చర్యముగా
నీలాద్రిరాజు బట్టం
బో లోలత మెరయు పెద్దభూతమొ యనగన్. ‖ 93 ‖

ఉ. అప్పుడు సోమయాజులు తదాకృతి వేంకటసానియుక్తుఁ డై
ఉప్పలు మోడ్చ కర్మిలి నెటిం గని కూఁతుర నీకు దుల్యు యౌ
నొప్పులకుప్ప నిప్పుడమి నొక్కెడ జూడము లోలవయ్యు బా
గొప్పెడు బాలలీల గడు నూనితి మేల్బళి యంచు మెచ్చుగన్. ‖ 94 ‖

క. నీలాద్రిరాజు వార
స్త్రీలోలుం డయ్యె నింక జెడి వైతరిణిన్
గూలు నిటు లనుచుఁ దెల్పెడి
పోలిక నంభోధిఁ గ్రుంకెఁ బ్రొద్దు రయమునన్. ‖ 95 ‖

క. అపకారి నీలభూపతి
అపయశ మల విష్టపముల నలమె ననంగా
విపులమగు కటికచీకటి
విపులాస్థలి నంబరమున విప్పుగ కప్పెన్. ‖ 96 ‖

శా. అంతన్ దారలు దోఁచె నంబరమునం దా నీలభూపాధముం
డెంతేఁ జంద్రిని గూడఁ దత్తనువునం దింతైన సందీయ క

– – –

త్యంతంబున్ రసపొక్కు లిట్లు వొడమున్ దథ్యం బటంచున్ నభః
కాంతారత్నము దెల్పెనో యన మహాగాఢాతిధౌతచ్ఛలిన్. ‖ 97 ‖

ఆ. తాను జంద్రరేఖ నా నెసంగుదు నంచు
సాని పిప్పితొత్తులోన నుబ్బు
దాని నేఁతు నంచు దాఁ గోపమున వచ్చె
నో యనంగఁ జంద్రుఁ డుదితుఁ డయ్యె. ‖ 98 ‖

వ. అయ్యవసరంబున. ‖ 99 ‖

ఉ. వేంకటసోమయాజియును వేంకటసానియు శ్రద్ధులై కడున్
బొంకపు మాటలున్ వగలు బుద్ధులుఁ దద్దయుఁ జెప్పుకొంచు లోఁ
గొంకక నీలభూవిభుని గొల్లెనలోనికి దాని దూర్చి పూ
కంకటిచెంగట న్నిలుపఁ గన్గొని యా నరపుండు వేడుకన్. ‖ 100 ‖

ఉ. దిగ్గున లేచి దండ మిడి ధీవర యజ్ఞముఁ జేసినావు మున్
బగ్గెగ మేము మన్మథవిపద్దశనుండి తొలంగ నిప్పు డీ
సిగ్గరికన్నెఁ దార్చితివి చెప్పఁగ శక్యమె నీ ప్రభావ మీ
వగ్గివి గాక బాపడవె యారయ వేంకటసోమపీథిరో. ‖ 101 ‖

ఆ. యెద్దుమానసుఁడవు యేదాంతుగుఁడవు సో
మాదుగుఁడవు నీవు మామ వైతి
మాకుఁ బున్నె మెలమిఁ జేకూఱెనౌ చంద్ర
రేఖ మీఁఖ చంద్రరేఖ వలన. ‖ 102 ‖

క. నావుడు నతఁ డిట్లనియెను
దేవా తావకకటాక్షదృష్టివలన నే
కావించితిఁ గ్రతు విపు డిది
నీ వన్నియఁ జూచి వలచె నీలనృపాలా. ‖ 103 ‖

సీ. కైశ్యంబు కందంబు ఘనగోధిచంద్రమః
ఖండంబు భ్రూద్వంద్వకము ధనుస్సు
చక్షుస్సులు చకోరపక్షు లోష్ఠంబు పీ
యూషసరస్సు పయోధరములు
మాతంగకుంభముల్ మలినరోమాళి పి
పీలికాశ్రేణి గంభీరనాభి
విషనిధి కటి మహావిపులసువేది ప
త్తామరసంబు మదనసదనము.
గీ. పాండురాశ్వత్థభూరుహపత్ర మిట్టి
సరససౌందర్యవతి యగు చంద్రరేఖ
నీకు దొరకెను సంభోగనిహితలీల
దక్క నేలుము నీలాద్రి ధరణిపాల. ‖ 104 ‖

ఆ. దీనితల్లి యీమె నా నేస్తురాలు మే
మిరువురమును నీకు హితుల మెట్లు
సాఁకెదవొ యటంచుఁ జంద్రి హస్తము తెచ్చి
యతనిచేత నుంచి యప్పగించి. ‖ 105 ‖

క. ముప్పదియాఱేండ్లది ముం
దెప్పుడు నొక్కరునిఁ బొంద దేలాగున నీ
విప్పుడు దిద్దుకొనియెదో
మొప్పెతనము మాన్పవలయు ముందఱపనిలో. ‖ 106 ‖

వ. అని మరియును.

శా. కం పేపారెడు మంచిగంధమును బుక్కా క్రొత్తపన్నీరు క
ప్రంపున్వక్కలు నాకులున్ దబుకుతోఁ పర్యంకమం దుంచి తా
దంపత్యోశ్చరకాలభోగ్య మను వృత్తంబుల్ మహాపస్వరం
బింపారన్ బఠియించి వేంకటమనీషీంద్రుండు మోదంబునన్. ॥ 108 ॥

శా. తారామార్గముఁ జూచి మంగళముహూర్తం బిప్పు డేతెంచెఁగా
యో రాజాగ్రణి పుస్తె కట్టు మిఁక జాగూనంగ నేలా ధ్రువం
తే రాజా వరుణో యటంచు నుడువన్ దేజంబు దీపింపఁ ద
న్నారీకంఠమునన్ ఘటించెను సువర్ణప్రస్ఫురత్సూత్రమున్. ॥ 109 ॥

క. తలబ్రాలు వోయ నవి జిల
జిల జాల్కొని మదనసదనస్నిగ్ధస్థలిపైఁ
బొలిచెను భావిసురతసం
కలితేంద్రియ మిట్లు పైని గప్పు నను గతిన్. ॥ 110 ॥

వ. అనంతరంబున వేంకటశాస్త్రి యిట్లనియె. ॥ 111 ॥

శ్లో. యభస్వపుష్పిణీం చంద్రరేఖామలమఖీమిమాం
చంద్రరేఖాం భగవతీం త్వం నీలాద్రిప్రజాపతే. ॥ 112 ॥

శ్లో. త్వన్మందిరే బహుళకాంచనసిద్ధిరస్తు
వంశాభివృద్ధిరధికాస్తు శివారవోస్తు
బాలార్కకోటిరుచిరస్తు మలేతరాస్య
నీలాద్రిపుణ్యాజనవర్య హరిప్రసాదాత్. ॥ 113 ॥

వ. అని యాశీర్వదించి యిట్లనియె. ॥ 114 ॥

క. స్మరమందిరాంగణంబున
కరదంతక్షతము లుంచి గాఢరతుల భీ
కరభంగిఁ జేయ కిప్పుడు
తురతుర నవ్వెనుక మెల్లఁ ద్రోయఁగ వలయున్. ॥ 115 ॥

ఆ. ఆకు పోఁక వెట్టి లోఁకువగాఁ బట్టి
పూకు మెల్ల నిమిరి నూకవలయు
డాకఁ జేసి వేగఁ దాకంగఁ బోవద్దు
నీకుఁ దక్కుఁ జంద్రి నీలభూప. ॥ 116 ॥

వ. అప్పుడు వేంకటసాని యిట్లనియె. ॥ 117 ॥

క. బాల సుమీ గోల సుమీ
బేల సుమీ గాఢరతులఁ బెంపేద కడున్
సోలింపక తూలింపక
పాలింపుము చంద్రి నీదు పాలయ్యె నిఁకన్. ॥ 118 ॥

క. డా సిండు విడెము మరుచే
గాసిం డగ్గఱక మున్నుగా మచ్చికఁగా
జేసిండు సొమ్ము పిదపన్
నీ సేఁతల కెల్ల నోర్చు నీలనృపాలా. ॥ 119 ॥

వ. అని చంద్రరేఖం జూచి యిట్లనియె. ॥ 120 ॥

క. సచ్చేఁడా పబు వీతఁడు
యెచ్చమునకు పచ్చమునకు యిచ్చలయిడిగా

యిచ్చును హెచ్చుగఁ గొలువుము
సచ్చు యిటుల సేరబోక సందర లేకా. ‖ 121 ‖

క. దేవేరిఁ గేరెదవు స
ద్భావంబున నితఁడు చేతఁ బట్టిన నీ వో
పూవుంబోడిరొ విటసం
భావనపైఁ దలఁపు విడిచి బత్తిఁ గొలువుమా. ‖ 122 ‖

సీ. పాట పాడు మటన్నఁ బాడక యెలుఁగెత్తి
పదరి రోదనము చేసెదవు సుమ్ము
కా ళ్ళొత్తుమని వేఁడఁ గడువడి నొత్తక
నెదురొత్త మని పలికెదవు సుమ్ము
తముల మందిమ్మన్నఁ దమి నీక క్రమ్మఱ
నీ కిమ్మటంచుఁ బెనఁగెదువు సుమ్ము
రతికి రమ్మని పిల్వ రాగిల్లి డాయక
యదనునఁ గడకుఁ బోయెదవు సుమ్ము.
గీ. తురకదండి గాఁడు దూదేకులియుఁ గాఁడు
పసులవాఁడు గాఁడు బట్టు గాఁడు
మనల నేలు నట్టి మనుజనాథుఁ డితండు
సెప్పి నట్లు నీవు సేయు చంద్రి. ‖ 123 ‖

వ. నావుడు నతం డిట్లనియె. ‖ 124 ‖

ఉ. పుత్తడి కీలుబొమ్మ యనఁ బోలెడు బోలెఁడు యోని చందిరిన్
హత్తఁగఁ దోడితెచ్చి విరహార్తి హరింపఁగఁ జేసినావు నీ
కుత్తమభూషణాంబరసముత్కర మిచ్చెద వేగ నందు మో
యత్త వలగ్ననిర్జితవియత్తల వేంకటసాని జానుగన్. ‖ 125 ‖

క. అన నవ్వుచు వారిద్దరు
జని రంతట నీలవిభుఁడుఁ జంద్రిని గని నూ
తనమదనకేళిఁ దేలెద
నని లోపల మోహ మొదవి హస్తము పట్టన్. ‖ 126 ‖

క. తల వంచి పట్టెకంకటి
గల దండము పట్టి వదలఁగా నొల్లక తా
వెలవెలఁ బోవుచు సిగ్గుం
గల బాలికవోలెఁ బెనఁగఁగా నాతండున్. ‖ 127 ‖

ఉ. ముంగటికుచ్చు పట్టుకొని మోహమునన్ దన శయ్యఁ జేర్చి వా
రాంగన వింత సిగ్గువడ నర్హమె యెందఱఁ జక్కఁబెట్టితో
దొంగతనంపు టీ వగలు ద్రోచి హసన్ముఖి వయ్యుఁ గౌగిటన్
లొంగఁగఁబట్టి నన్ను రతిలోలునిఁ జేయుము నీకు మ్రొక్కెదన్. ‖ 128 ‖

ఉ. చంద్రుఁడు మింట నంటి సరసంబుగ నగ్నికరాళవిస్ఫుర
చ్చంద్రికఁ గాయఁజొచ్చె సుమచాపుఁడు బాణము లేయఁజొచ్చెనో
చంద్రి విలాసవిభ్రమవిశాలకళారసలీల మీఱఁగా
సాంద్రకృపాకటాక్షమునఁ జక్కఁగఁ గన్గొని కోర్కెఁదీర్పుమా. ‖ 129 ‖

సీ. సకలభాగ్యములిత్తు చక్కరకెమ్మోవి
చవులు చూపింపవే చంద్రరేఖ
శంబరాంతకుచేతి శరముల కోర్వను
జక్కఁ గౌఁగిట డాఁచు చంద్రరేఖ
చల మేల పూనెదు వలపు నిల్పఁగఁజాలఁ

జన్ను లంటఁగ నిమ్ము చంద్రరేఖ
తాళఁజాలను నీదు కాలికి మ్రొక్కెద
స్మరమందిరము జూపు చంద్రరేఖ.
గీ. కడకుఁ బోవక నెమ్మోము ముడుఁచుకొనక
సిగ్గు విడనాడి ననుఁ గటాక్షించి నీదు
కన్నెప్రాయంపు రతికేళిఁ గలయనిమ్ము
జాగు సేయక కటకపుఁ జంద్రరేఖ. ॥ 130 ॥

క. నీకున్ దాస్యము చేసెద
నాకుం గల ధన మొసంగి నానాగతులన్
బైకొని రతి న న్నేలుము
ప్రాకటముగఁ జంద్రసాని పల్లవపాణీ. ॥ 131 ॥

చ. సిగ విడి జాఱ మోముపయిఁ జెమ్మటబిందువు లూర గబ్బిచ
న్నొగడలు నిక్కు దేఱ దెగి ముత్తెపుఁబేరులు శయ్యఁ జేరఁగా
భగ మతిసార మూర జలపంకకళంకిత జీలువారఁగా
వగఁ బురుషాయితంబున నవశ్యము నేలుము చంద్రరేఖరో. ॥ 132 ॥

క. నా విని శరావసన్నిభ
కేవలసుస్నిగ్ధమదనగృహము చెమర్పం
గా వాలుబెళుకుఁజూపులఁ
దా వలనుగ నతనిమోము తప్పక చూచెన్. ॥ 133 ॥

క. ఇటువలెఁ జూచిన నాతఁడు
తటుకున నిదె సమయ మనుచుఁ దమి దీరఁగఁ గౌఁ
గిట నొత్తి మోవిమధు వటు
గుటుకుగుటుకు రనుచుఁ గడుపుకొలఁదిన్ గ్రోలెన్. ॥ 134 ॥

సీ. బుడ్డికుండలవంటి బుగ్గలు చుంబించి
గొట్టెబొచ్చును గేరు కురులు నిమిరి
కప్పచిప్పలవంటి కన్నులు ముద్దాడి
యూదబొడ్డున కరం బూది నిలిపి
కొలిమితిత్తులఁ బోలు కుచములు పీడించి
మరగాళ్ళఁ దెగడెడు కరము లంటి
కొంగకంఠమువంటి కుతుక గోరుల నించి
పులిబోను బోలెడు పూకు చమిరి.
గీ. వెడద కుంచములో వ్రేలు వెట్టినట్లు
యోనిలోఁ గామదండము నొత్తి దూర్చి
వెనుకకును ముంగలికి నూఁగుకొనుచు నీల
ధారుణీశుండు వడివడిఁ దాఁక నదియు. ॥ 135 ॥

క. మును నల్లమందు మాజుము
తినియున్నది గాన మేను తిమ్మిరిగొని యా
తని తాఁకులకుఁ జలింపక
తన నేరుపుకోపుఁ జూపఁదలఁచి కడంకన్. ॥ 136 ॥

క. భగము వికసింపఁజేయుచు
బిగఁబట్టుచు లోనఁ జొర నభేద్యంబుగఁ ద
ప్పఁగఁ ద్రోయుచు బెణకించుచు
బిగితొడలం జుట్టి పట్టి బి ట్టలరించెన్. ॥ 137 ॥

సి. పొరదోపమవీర్యధారాతతభగంబు
స్తనచర్మభస్త్రికాతాడవంబు
కక్షప్రదేశనిర్గతఘర్మసలిలంబు
చక్రక్రమచపేటచాలనంబు
భూరితరాపానమారుతోద్ధూతంబు
ఘనదేహదుర్గంధగంధిలంబు
శునకబంధవిశేషవినమితమేఢ్రంబు
క్రీడారచితపాదతాడనంబు.
గీ. గార్దభస్వరనిస్సరద్గ్రామ్యవచన
మమితరోదనజలపూరితాననంబు
చంద్రరేఖాభిధానవేశ్యానలాస్య
ప్రథమసురతంబు నీలభూపతిఁ గరంచె. ‖ 138 ‖

వ. ఇవ్విధంబున సమరతిఁ గావించి నప్పు డప్పుడుపుంబో టిమిన్న మున్నెరికంబున నన్నీలాద్రిరాజపుంగవుపై లంఘించి హుంక రించి జం కించుకయు లేక సంకోచంబు మాని “ఇంక నాచేతం జిక్కితి వెక్కడికిఁ బోయెదవు నిలునిలు నా యుపరతి చమత్కారంబు తోరంబుగాఁ జూపెదఁ బరాకు గాకు రాకొమరా మా ఱాడక నా కేమి మెప్పు లిప్పు డిచ్చెదవో మది నెంచుకొమ్ము” అని చెక్కిలి నొక్కి యక్కునం గ్రక్కునం దన లంబమానపీనస్తనంబులు గది యించి నునుదొడలఁ గుదియించి వదలని మదంబున ముదంబునం దన మదనసదనంబున నతని మేహనంబును నమోఘంబుగాఁ దగిలిం చుకొని ముమ్మరమ్ముగా దొమ్మరికొమ్మ గడగడసియాడు చందం బున సంభ్రమించుచు లాగివైచు చందంబున నొత్తుచు మేను మేన హత్తింపుచుఁ దత్తరింపకఁ గొంచెపడకఁ దిట్టతనంబుఁ దెచ్చుకొని విచ్చలవిడి ముచ్చట లెల్లం దీరఁ జనుమిట్టల గట్టిగ బిగఁబట్టి యిట్టట్టు బెసఁగకఁ దడంబడక గుట్టుచెడకఁ జేతులు పట్టువిడక నెదురు దట్టింపు మని చేయి మార్చు మని యడుగు తప్పె నని మించఁ బలుకుచుఁ గులుకుచుఁ గోడెప్రాయంపు నాడెంపు సాలెవాఁడు ఘళుకు ఘళుకు మనఁ బలక చులుకఁగ దాటించు వాటంబున నోటువడక నీటుఁజూపుచుఁ బరిభ్రమణవేగంబునం గరపాదభూషణవిశేషం బులు ఘల్లుఘల్లుమని భీషణంబుగ ఘోషింప నవ్వారయోషాల లామంబు పెదవి పెదవిం గదియఁ దన నిడుదవాడిమొనపంటిం బట్టి పీల్చుచు చిట్టికుట్టువెండ్రుకల తొట్టుకొప్పువీడి యక్కటిప్రదేశం బున నటియింపఁ గుండలంబులు గండతలంబునం దాండవింపఁ గోరిద కంపసొంపునం బెంపారు కంపుమేనుల ననూనంబుగాఁ గ్రమ్ము ముమ్మరంపుఁ జెమ్మటసోన లతని దుర్భరతరసంవృథమానదేహశాల్మ లీద్రుమంబునందు దిగజాఱు వీరులసివం బెత్తిన లాగున నూగు లాడుచుండం గని యాప్రజాపతి సేద దీర్చుకొని క్రమ్మఱ నమ్మరు దురంబున కెదిరించి వదలని చలమ్ము హెచ్చఁ బెచ్చుపెరుఁగు మచ్చరంబున సమదమ్ముగ నదుముకొనిన నదియు వదలక పదరుచు గుదికొన్న తమకమ్మునం దలంకక నెదురుదాక ఢాక నిద్దఱుం దద్దయు సంభ్రమంబున జలంబును జయకాంక్షయు మనంబునం బెనంగొన నగ్గలంబుగ నిగ్గుచు వెనుకకుం దగ్గుచు మొగ్గరించుచుఁ బగ్గెలు సెప్పు కొనుచుఁ జెండుచెండుగ బండబండగఁ దాకులాడు నెడ నచ్చంద్ర రేఖ బహువిటజనసంయోగజనితచాతుర్యకళాధుర్య కావున మొగ్గ వేసి యోటువడంజేయ సమకట్టిన నా దిట్టమట్టిఱేఁడును బహుగణి కావిలాసినీదాసికాసంభోగసంభృతనైపుణీగుణగణగణ్యుఁడు గావున

వెనుదీయక నునుదొడలం దానినడుము బిగించి మా ఱొడ్డుచుఁ
దెబుకుతెబుకు మను చప్పుడు లుప్పతిల్ల బిట్టట్టుసేఁతల నెట్టుకొని
గుట్టు వదలక పట్టుపట్టి సూటిఁదప్పకుండ గండుమీఱి మూర్కొన్న
మహిషంబులడంబునఁ జిత్తకుక్కలవిధంబున చీరబోతులభాతి
మాలమాసటీండ్లంబోలె మార్జాలంబులకైవడి మసకంపుఁబెను
బాములచందంబున మదించిన కోడిపుంజులమాడ్కి లకుముకుల
లాగున గొఱ్ఱెపొట్టేళ్ళభాతి గుంటుకఁ దోలులీల కొర్తవేసిన
కైవడి చిట్టాముదములఁ గ్రుమ్మునేర్పున గొంకుజంకులేక
సమరతి యుపరతి బంధంబులం దేల జిలజిల మరుజలంబులు జాలు
కొని తదీయశయ్యాతలంబునం బడి వెల్లివిరిసి సెలయేరులై పాఱ
మహామైథునసంకల్పసంభోగక్రీడావినోదంబులు సూపి యలసి సొలసి
తొడల తొడలును బాహువుల బాహువులును మోవిని మోవియు
మొగంబున మొగంబును పదంబుల పదంబులును నురంబున నురం
బును భగంబున లింగంబును గదియఁ గౌఁగిలించుకొని దీర్ఘనిద్రా
సమాయుక్తనేత్రులై పడియుండి రనంతరంబున. ‖ 139 ‖

క. తమ్ములఁ జక్రమ్ముల నధి
కమ్ముగ బాధించు రాజు కాంతి దొరఁగి వే
గమ్మునఁ గ్రుంకెన్ దద్గతిఁ
గ్రమ్మరు నీలాద్రిరాజు గ్రుంకక యున్నే. ‖ 140 ‖

క. అల నీలాద్రిమహీపుం
డెలమిని జంద్రిని రమించి యెంతయుఁ దేజో
బలహీనుఁ డగుటఁ దెలుపన్
దెలుపు వొడవి నట్లు తూర్పు తెలతెలవాఱెన్. ‖ 141 ‖

క. ఇనవంశసంభవుండై
ఘనసన్మార్గంబు దొరఁగి కాముకుఁ డౌ నీ
లనృపతిఁ గాదనఁ గినుకన్
జనుదెంచె ననంగ నపుడు సవితృఁడు దోఁచెన్. ‖ 142 ‖

తే. అంతఁ జింతలపాటి నీలాద్రిరాజు
మొగము వెలవెలఁబోవంగ నిగుడి లేచె
చంద్రరేఖయు ముఖకాంతి సడలి కనుల
నుసుముకొంచును మేల్కాంచి మసలుచుండె. ‖ 143 ‖

వ. అత్తరి నా రాజోత్తముండు దానిం గూర్చి యిట్లనియె. ‖ 144 ‖

క. నావంటి రసికు డెందముఁ
గేవలముగఁ గరఁగఁజేసి కేరుచు మిగులన్
భావభవకేళి దాసుని
గావించితి నీకు సాటి గారే సానుల్. ‖ 145 ‖

క. నీ మొగము నీ త్రికోణము
నీ మెఱుఁగుంగన్నుదోయి నీ నునుఁదొడలున్
నీ మోవి నీ కుచంబులు
నా మది నిఁక మఱవజాల నమ్ముము బాలా. ‖ 146 ‖

క. సొమ్ములు చీరలును వరాల్
సమ్మతమున నీకు నిత్తు సత్యం బిఁక నా
సొమ్మయి యుండుము విటసం
ఘమ్ములతోఁ జెలిమి మాని కలికీ యెపుడున్. ‖ 147 ‖

ఆ. సానిదాన నంచుఁ బూని లోలో వెచ్చ
కాండ్రఁ గూడ నేను గాంచినపుడె
చన్ను ముక్కు యోనినున్న గొల్లియుఁ జిట్టి
కొప్పుగోసి వెళ్ళఁగొట్టువాఁడ. ‖ 148 ‖

క. రాయవరంబున నీ క
త్యాయతగేహంబు గట్టి యం దుంచెద నీ
వే యెడకుఁ బోక యుండుము
నీ యండనె యుండువాఁడ నే నచ్చోటన్.

తే. నాపుడు న దిట్టు లనియెను దేవ నాకు
నీవు దయ దండఁ జిక్కుట కేవలముగ
సకలసామ్రాజ్య మిచ్చుటె సంశయంబు
లేదు నీదాన నై యుందు మోదముననను. ‖ 150 ‖

క. నీకంటె లోనిచుట్టము
నా కిచ్చెడువాఁడుఁ గలఁడె నానాగతులన్
జేకొని కాపాడుము సుగు
ణాకర యెవ్వరిని జేర నరుగక యుందున్. ‖ 151 ‖

వ. అంత నంతకుమున్న గోతియొద్ద నక్కచందంబున ద్వార
బంధమ్ముకడఁ గాచుకొనియున్నవాఁడు గావున వేంకటసోమయాజి
యిదంతయు నాలకించి తటుక్కున లోనికిం బ్రవేశించి యిట్లనియె.

క. ఇషు వినుము చంద్రరేఖా
భషకమువలె నిన్నుఁ జేతఁ బట్టి యెవరినిన్
విషయింప నీయ గట్టిగ
మృష గా దని పలికె మిగులఁ బ్రేమ దలిర్పన్. ‖ 152 ‖

వ. అయ్యవసరంబున.

సీ. ప్రాఁతపుట్టము కట్టి పూఁతచెందిర వెట్టి
పాఁతచెప్పులు మెట్టి చేత గట్టి
కోలసోలుచుఁ బూని చాల మద్యం బాని
ప్రేలుకొంచును గూను గ్రాల యోని
పుండ్ల కీఁగలు వ్రాల జండ్లు బొడ్డునఁ దూలఁ
గండ్ల పుసులు కార రొండ్లు వ్రేల
నోరఁ దేగుడు గాఱ యూర బేరము మీఱ
సారె పయ్యెద జాఱ యోరఁ జేర.
గీ. దారి నెముకుచు బడబడ దగ్గుకొనుచు
నపుడు వేంకటసాని నీలాద్రిరాజు
గొల్లెనకు నాతులటుపాయఁ గొనుచు లోని
కరిగి చే యెత్తి మ్రొక్కి యిట్లనుచు బలికె. ‖ 155 ‖

క. నీ బానిసతొ త్తిది దయ
చే బాసల నిచ్చి చాలఁ జేపట్టు మికన్
గాబాగూబిగఁ జేయక
నీ బంతిని గూడు గుడుపు నీలాద్రినృపా. ‖ 156 ‖

వ. అనిన నతం డత్యంతసంతోషస్వాంతుం డై యట్ల చేసెద
నని దానికిం బీతాంబరాదికంబు లొసంగి చంద్రియె లోకంబుగా
మెలంగుచుండె. ‖ 157 ‖

సీ. రతిఁ జేసి యలసిన ధృతి దాని మన్మథా
గారద్రవం బెల్లఁ గడిగి తుడుచు
నాఁకుఁ జుట్టి యొసంగి నది తమ్మలము సేయఁ
దమ్మ గైకొని నోరఁ గ్రుమ్మి నమలు
నది మదిర గొనంగ నది మంచిదే యని
తచ్ఛేషహాలమోదమునఁ ద్రావు
నిదురించుతఱి దాని పదములుఁ దొడలు త్రి
కోణంబు సుఖముగా గ్రుద్ది పిసుకు.
గీ. మెల్లనే దాని మంచము నల్లిఁ జంపు
లావుగుబ్బల గంద మలంది నిడుద
క్రొమ్ముడిని పూవుటెత్తులఁ గూర్చు వలపు
గులుక నీలాద్రిభూపాలమలహరుండు. ‖ 158 ‖

క. ఇ ల్లెఱుఁగక ప ట్టెఱుఁగక
యెల్లధనము దాని కిచ్చి యెగ్గును సిగ్గున్
జెల్లఁగఁ దత్పాదద్వయ
పల్లవముల దండ మురిసి పడి కా పుండెన్. ‖ 159 ‖

తే. పుడమిపై గూదలంజెకు బుడ్డవేడ్క
కాఁడ ననెడుమాట చంద్రరేఖకును నీల
ధరణివరునకుఁ జెల్లెను దత్కథావి
ధాన మెఱిఁగించితిని నీకుఁ దథ్యముగను. ‖ 160 ‖

తే. అనుచుఁ దంబళ వీరభద్రార్యమణికి
నంబి నరసింహుఁ డతులితానందహృదయ
కమలుఁ డై చెప్పి యంతట సముచితగతి
నతని వీడ్కొని చనె దేవతార్చనకును. ‖ 161 ‖

క. వాచాగోచరముగ భువి
నాచంద్రార్కంబు గాఁగ హాస్యరసముచే
నా చంద్రరేఖ కథయును
నీ చరితముఁ జెప్పినాఁడ నీలనృపాలా. ‖ 162 ‖

క. ఈ కృతికి సమముగాఁ గృతి
నే కవులునుఁ జెప్పఁజాల రిది బిరుదము భూ
లోకము రాజులలోపల
నీకు దొరకె హాస్యలీల నీలనృపాలా. ‖ 163 ‖

చ. ధరణియు మేఘమార్గమున దారలుఁ దామరసాప్తచంద్రది
క్కరటిగిరీంద్రశేషఫణికంధికిటీశ్వరకూర్మనాయకుల్
స్థిరముగ నెంతకాలము వసింతురు తత్క్రియ నీ ప్రబంధ ము
ర్వర సరసోత్తముల్ కవులు వర్ణన సేయఁగ నుండుఁ గావుతన్. ‖ 164 ‖

క. చేటీవధూటికాకుచ
కోటీసంలబ్ధవిపులకోమలపంకో
త్పాటనకరఖరనఖర ని
శాటోపమఘోరరూప యార్యదురూపా. ‖ 165 ‖

స్రగ్విణి. రాచిరాజాన్వయా రామదావానలా
యాచకాస్తోకమేఘౌఘఝుంఝానిలా
నీచవారాంగనానిత్యరత్యాదరా
పాచకాధార నిర్భాగ్యదామోదరా. ‖ 166 ‖

గద్యము
ఇది శ్రీమజ్జగన్నాథదేవకరుణాకటాక్షవీక్షణానుక్షణసంలబ్ధసరసకవితా
విచిత్ర సలలితాపస్తంబసూత్ర కౌండిన్యసగోత్ర కూచిమంచికుల
పవిత్ర గంగనామాత్యపుత్త్ర మానితానూనసమాననానా
విధరనంగత్రిలింగదేశభాషావిశేషభూషితాశేషకవితావిలా
సభాసురాఖర్వసర్వలక్షణసారసంగ్రహోద్దామ శుద్ధాం
ధ్రరామాయణప్రముఖబహుళప్రబంధనిబంధన
బంధురవిధాన నవీనశబ్దశాశనబిరుదాభిరామ
తిమ్మకవిసార్వభౌమసహోదర గురుయశో
మేదుర వివిధవిద్వజ్జనవిధేయ జగన్నాథ
నామధేయ ప్రణీతంబైన చంద్రరేఖా
విలాపం బను హాస్యరసప్రబంధ
రాజంబునం తృతీయా
శ్వాసంబు
సంపూర్ణము.

